ఓం

శ్రీరాంజనేయాయనమః.

# యథార్థము

## (లేక పతివ్రత)

ఐదంకములు సాంఘిక నాటకము

[కథకల్పితము.]

కర్త:

మ॥ రా॥ శ్రీ రాయసం వేంకటరమణయ్య

గోవిందపురం :: గుంటూరుజిల్లా.



పబ్లిషర్సు:

రాతు చంద్రయ్య

బుక్సెల్లర్సు అండ్ పబ్లిషర్సు,

రాజమండ్రి.

 [వెల రు 1—0—0.

# పాత్రలు

రామం:—(కథానాయకుడు)

మన్మథుడు:—(రెండవ కథానాయకుడు)

మాధవుడు:—(సీత తాత—వృద్ధుడు)

గిరిరావు:—(రామం మిత్రుడు)

పోష్టుమాను:—

భైరవశాస్త్రి:—

బాబు:—(రామం పుత్రుడు)

సీత:—(కథానాయకి)

రాజ్యం:—(రెండవ కథానాయకి)

శాంతమ్మ:—(రామం తల్లి వృద్ధురాలు)



# మనవి

చ. గురుముఖమ్మైన విద్య నమ ♦ కూరమిచేతను తోఁచినట్టులీ
కరణిని నాటకంబుగను ♦ కల్పన జేసి రచించి నాడనో
పరమను పూజ్యులార ♦ ఘనపండితులార! మదీయగ్రంధమం
దరయఁగ తప్పులున్నను బు ♦ ధాగ్రణులార క్షమింప వేడెదన్.



ఓం

శ్రీవీరాంజనేయాయనమః.

# యథార్థము

## (లేక పతివ్రత)

### ప్రథమాంకము—ప్రథమరంగము.

(రాజేశ్వరి తనగదిలో యేకాంతంగా కూర్చొని తనలో)

ఆహా!

ఉ. సోముఁడు లేనిరాత్రిగతి ♦ శోధనలేని కవిత్వమట్లు మీ
ల్నామములేని సంబిస్తితి ♦ నాథుడులేని రణంబురీతి స
త్ప్రేమములేని పెండ్లివలె ♦ పెద్దలులేని సభావిధంబు నా
రామములేని మద్హృదయ ♦ రాజ్యమరాజకమాయె నిత్తఱిన్.

నిజమునకు నామిత్రబృందమున నెందరు సుందరసుకుమారులు లేరు. వారిని యాసింపని నాహృదయకమలము రాముచెలిమినే యేల యాసింపవలయును. అతనికడ యేదియో యసన్యసామాన్యమైన మహాత్మ్య మిమిడియున్నది. నే డింకనూ రాడాయె. యెటకేగెనోకదా. అత డరుదెంచకమున్నే అనంపూర్తిగా చిత్రింపబడిన యాతని ఛాయాచిత్తరువును పూర్తి చేసె

దను. (అనుచు కుంచబూని ఆడుతూ పాడుతూ చిత్రించుచుం
డును. ఇంతలో రామము ప్రవేసించి చూచి)]

రామం—ఓహో! హో! ఏమి యీ యానందముఖ పారవశ్యం.

ఉ. ఆడుచు వేడుచున్ జగతి ♦ నంతను నిద్దురబుచ్చు గీతికల్
బాడుచు కుంచబూని కడు ♦ బాగుగ చిత్రపఠంబు వ్రాయుచున్
మేడను గుల్కుచుండె నోహో ♦ మేలిమి బంగరుతీగరీతి నే
చూడగలేదు యీరకవు ♦ సుందరమంగళ కోమలాంగినిన్.

రాజ్యం—అబ్బా! ఇప్పటికి పూర్తిచేయ గలిగితిని.

రామం—రాజ్యం! రాజ్యం!

రాజ్యం—(చూచి) రామం! రా,నే వొచ్చావా! నీకొఱకు బిందుపతన కాంక్షితయగు ముత్యపుచిప్పలా గెదురుచూచుచుంటిని.

రామం—నేనునూ శీఘ్రముగ మనమున నే యరుదెంచుచుంటిని.

రాజ్యం—గానతుంబురుడవు. పైగా కవిరాజువు. శిల్పకళానిధివి. ఇప్పుడు హాస్యకళానిధివికూడా కానున్నావు. సంతోషం. అవధరింపుము.

రామం—నరేశానీ! ఏమిటా చిత్రించినది...?

రాజ్యం—భవదీయ దివ్యమంగళస్వరూపాన్ని చిత్రించాను.

రామం—ఏదీ చూతాం (తీసికొనిచూచి) వహ్వా! ఎంతబాగా చిత్రించావు రాజ్యం!

రాజ్యం—ఇదంతా నీవు నేర్పిన విద్యగా రామం!

రామం—ఐనచో దీనిని నాకు కిమ్మత్తున కిత్తువా—?

రాజ్యం—అట్లుకాదు నీకు దీనిని బహుమతిగా యిచ్చుకుంటాను.

రామం—ధన్యుడనే.

రాజ్యం—దీనిని మీకు సమర్పించి నేనున్నూ ధన్యురాల నైనాను.

రామం—చిత్రకళారాధన స్త్రీల కర్తవ్యమైన సువిద్యయని స్త్రీలోకమున కొక నీతిపాఠమును నేర్పినావుసుమా.

రాజ్యం—ఇంతటికీ మూలం తమసానుభూతియేగా—

రామం—రాజ్యం! కొలదిరోజులనుంచీ నా కొక చిన్నసందేహము జనించి నేటి కది మహామ్మేరువగా మారిపోతున్నది.

రాజ్యం—బహిర్గతము చేయండి. ఆపై నాహృదయసముద్రము దానిని మ్రింగగలుగునేమో ప్రయత్నిస్తా.

రామం—మనయిరువురమూ ఇకముం దింత చనవుగా సంచరించుట లోకమునకు పరిహాసపాత్రత కాదూ...?

రాజ్యం—(నవ్వి) రామూ! సంకుచితబుద్ధితో యనువారిమాటలు కాని స్త్రీపురుషులు సమానతుల్యులుగానున్న తప్పేమున్నది. పైగా మనమున్నది చెన్నపట్నం కాబట్టి పాటింపే లేదు.

రామం—రాజ్యం! స్త్రీపురుషులు కలసి తిరిగిన నీతిదూరు లగుదురని యందురుకదా...?

రాజ్యం—కలసి తిరుగ లేదనుకొందము, ఎందరు నీతిదూరులు కా లేదూ,

రామం—రాజ్యం! నీతి యవినీతి యనగా—?

రాజ్యం—నీతియన అంతరాత్మకు సమ్మతిగానుండి ఆచారవిరుద్ధము కానిది, దానికి విరుద్ధమే యవినీతి...

రామం—అంతరాత్మకు సమ్మతియైనది. పదిమందీ వొప్పనిచో అవి నీతి కాదా?

రాజ్యం—పదిమంది వొప్పనిచో యది నీతి కా దనను కాని మన మున్న ఈలోకము సంఘముపైని ఆధారపడియున్నది. ఎంత నీతికరకార్యమైననూ సంఘ మొప్పనప్పుడు అవినీతిగనే తెంచ బడును.

రామం—రాజ్యం! పూర్వముకన్నా మిన్నగా నీ వెన్నింటినో గ్రహించుకొనుచుంటివి. చదువమని యిచ్చిన గ్రంథముల నన్నింటిని చక్కగా చదువుచుంటివా యేమి?

రాజ్యం—రామం! చదువుకొనినచో ఇట్టివిషయాల గ్రహించుకో లేమా?

రామం—రాజ్యం! మానవుని గమ్యస్థానానికి చేర్చగలిగేది విద్యే. విద్యలేకున్న యుక్తాయుక్తభావమున తర్కించుకో లేము. తర్కించి ప్రపంచాన్ని ప్రేమింప తెలిసికో లేము.

రాజ్యం—రామం! ప్రేమ యెందుకు వెలుంగును?

రామం—ఋతువు లెందుకు మారును. మేఘము లెందుకు వర్షించును. పుష్పము లెందుకు సువాసనల చిల్కును. చెట్లు ఫలము లెందుకొనంగును. సూర్య చంద్ర గ్రహ తారకలు దివమందు జన్మింపుచూ లయించు టెందులకు? ఈకారణముల గ్రహించుకొన్న ప్రేమ మనుష్యులయం దెందుకు వెలుంగునో యర్థమగును.

రాజ్యం—రామం! అవి వాటిధర్మం స్వభావములబట్టి యట్లు చేయును.

రామం—మానవు డంతియేకదా? ఆతనిజన్మ ప్రేమించుటకు — ప్రేమించి జీవించుటకు — జీవించి లయించుటకు..., కానా...?

రాజ్యం—మరిప్రేమస్వరూప మొక్కటియేగదా? దాని కిన్నిమార్పు లెందుకూ?

రామం—ప్రేమ... ...మార్పులు... ...రాజ్యం! నీయీప్రశ్నలకు సమాధాన మీయను. కొలదికాలములో నీవే గ్రహించుకో గలవు.

రాజ్యం—కారణం?

రామం—నాకే నీప్రశ్నలు ఆశ్చర్యం కలిగిస్తున్నవి.

రాజ్యం—సరే ప్రేమతర్కమునకు స్వస్తి మంగళహారతియని యుంటిని. తరువాత—

తే. నన్ను నోలలాడించెడి ♦ నవ్యగీతి
భవ్యతరగీతి మాధుర్య ♦ భావగీతి
రాలనైనను గఱగింప ♦ జాలుగీతి
పాడి నాచేత పాడించు ♦ పరమపురుష!

రామం—నాకు సావకాశంలేదు. నే పోవాలి.

రాజ్యం—రామా! ఎప్పటికి పోవాలీ?

రామం—మావారికడకు. జాబుకూడా వచ్చింది.

రాజ్యం—అనగా మీఅమ్మగారికడనుంచా?

రామం—కాదు, మాతాతయ్యగారి వద్దనుంచి.

రాజ్యం—అబ్బో! అందుకే కాబోలును అత్తగారింటికేగే కొత్తఅల్లుని మాడ్కి తయారయ్యావు.

రామం—ఔను. అందులో అబద్ధ మేమున్నదీ?

రాజ్యం—పోకతప్పదా?

రామం—తప్పదు.

రాజ్యం—మరల మీపునరాగమన మెప్పుడు?

రామం—రేడియోగానానికి రాకతప్పదుగా. శలవు (నిష్క్రమించును.)

రాజ్యం—(తనలో) అహా!

తే. కటికిచీకటి గ్రమ్మె హృ ♦ త్ఖండమునకు
సూర్యుడున్నను నానవ్య ♦ సూర్యు డరుగ
ధ్యేయ మెయ్యది సంగీత ♦ దేవిడిపుడు
బావురనుచున్న దతిబాష్ప ♦ భరిత యగుచు.

యథార్థము

పాట

చుక్కలరథములో
ఎక్కి చక్కంగాను
దిక్కులన్నీ చూచియీా
వక్కకే వచ్చితివ చందురూడా నీవు
చిక్కకుంటివియేలో చందురూడా.

(తెర వ్రాలును)

ద్వితీయరంగము—కర్తపురి.

(రామం, సీత)

సీత—చెన్నపట్నంనుంచి వస్తూ నా కేమి తెచ్చారూ?
రామం—ప్రియాణబడలిక తెచ్చా—
సీత—అబ్బా! చెప్పండీ.
రామం—నీ కేదిష్టమో దానినే తెచ్చాను. ఇదిగో పుచ్చుకో.
(అని పట మిచ్చును.)
సీత—(చూచి) దీనిని యెవ్వరు చిత్రించారూ—?
రామం—చెన్నపురిలో ఒకస్నేహితురాలు చిత్రించి నాకు బహుమతిగా యిచ్చింది.
సీత—ఎంతముద్దుగా చిత్రించిందీ. మీరంటే ఆమెకు అంతముద్దోస్తా,
రామం—అదిగో! ఆ అనుమానపెనుభూతమే పేతకుటీరాలపై జగడాల జడివాన కురిపించేది.

సీత—ఆమె నవనాగరికురాలు, పైగా మీకు స్నేహితురాలు.

రామం—నీవినిర్మలహృదయాలయములో అనుమానపెనుభూతా లుండవచ్చునా సీతా...?

సీత—ప్రభూ! అనుమానపెనుభూతాలు లేని హృదయాలయా లున్నవా—?

మాధవుడు ప్రవేసిస్తూ—సీతా! ప్రయాణబడలికతో నున్న రామము నకు క్షీరపానీయమును తెచ్చిచ్చావా—?

సీత—ఆప్రయత్నముమీదనే వుంటిని పోతున్నా తాతయ్యా!

మాధవుడు—నాయనా రామం! చెన్నపురిలో నీవనులన్నీ నెరవేరాయా? మరల మరల పోనవసర ముండదుకదా?

రామం—ఏమో చెప్పలేను తాతయ్యా! నాపనులకు తుదా మొద లుండవు. ఐనా సీతను ఇకముందు విడచి దీర్ఘకాలము వొంట రిగా వుండను. ఈనాడే మచిలీపట్టణములో మాయమ్మగారి కడకు తీసుకపోవాలి. ఎంతకాలం ఈగుంటూరులో వుంచేది!

మాధ—రామం!

ఉ. సీతను తల్లిదండ్రులతి ♦ చిన్నతనంబున వీడినారు నా
చేతులమీద పెంచి దరిఁ ♦ జేరిచి నీతులనేర్పి నేడు నీ
చేతుల కందజేసితిని ♦ చేడియభారముఁ దీరిపోయె యీ
తాతకు హాయిగల్గు నికఁ ♦ దక్కిన చింతలు నాకు లేవికన్.

రామం—మరలమరల వెనుకటి వొప్పగింత లెందుకు తాతయ్యా!

మాధ—రామం! మాసీత కడు అమాయకురాలు.

తే. నీలముగనున్న వన్నియుఁ ♦ నీరమనియు
తెల్లనివి పాలటంచనిఁ ♦ తెలిసికొనెడి
అతియమాయకురాలు నీ ♦ తమ్మగనుక
ఇంతగా చెప్పుచుంటి నే ♦ నిన్నిసార్లు.

రామం—అహాయిత్యేరాలు కాదుగా.

మాధ—భూదేవత కున్నంతవోర్పు, సముద్రునకున్నంత విశాలహృదయం. అగ్నికున్నంత పవిత్రత. మావరహాలతల్లికి, మాసీతమ్మ తల్లికి సహజంగా సమకూరివున్నవి.

సీత—(క్షీరపానీయ మిరువుర కిచ్చి సీత విసరుచుండును)

రామం—సీతా! మీ తాతయ్య నుడువుచున్న పలుకులన్నీ యథార్థమేనా. ఐనచో సీతారాముల వనవాసక్లేశములోని ఘట్టములను చదివి అందలిమకరందమును పిండి పింగాణీపాత్రలో నున్న యీ క్షీరపానీయముతో మిళితముచేసి చంద్రధ్వజములబోలు నీ మంగళకరధ్వజములతో నాకిమ్ము. దేవేంద్రుడు రంభచేతి ద్రాక్షామృతమును గ్రోలినట్లు గ్రోలుతాను. పలుకవేమీ—? మరల మాఘనోమును నోమ పూనినావా? సదా యీ నోముల తోనూ వ్రతాదులతోనూ బక్కచిక్కి పోతున్నావు. స్వస్తి చెప్పరాదూ—?

సీత—అబ్బా! మీ రెప్పుడూ ఇట్టులే కోడిగా లాడుతుండారు. బిడ్డ తండ్రివికాబోతున్నావు. ఇంకనూ బాల్యమేనా?

రామం—మరి మీ తాత మహాపతివ్రతవని భడాజా పొగడ్తలు నా ముందు పొగడట మెందులకూ?

సీత—ఎవరిబిడ్డను వారు పొగడుకుంటారు; రేవు మీరో. మీబిడ్డను మీరు పొగడుకొనకుందురేమో చూస్తాగా.

రామం—(కాఫీ గ్రోలుతూ) ఒహ్హోహ్హోహో! అదియా విషయం. కాఫీలో పంచదారకు బదులు లవణముమ కలిపిచ్చిననూ మీ తాత ఎంతరుచిగా నున్న దీకాఫీయని పొగడుతాడు. నాబిడ్డ కూడా నాకిట్టులే యిస్తే నన్నూ పొగడ మంటావా?

మాధవు—రామం! నీవు వార్చాచనే వంతోషములో మునిగి పుట్టి
ళ్ళిన పంచదారకుజములు లవణమును కలిపి యుండవచ్చును.
లలనలకు లవణముకదా అందుబాటులో నుండునది.

సీత—"ప్రమాదో ధీమతా మపి" అని యెంతటివారికైనా పొరపాటు
గ్రహపాటు లుండకపోవు క్షమించుడు. మరల యిప్పుడు పంచ
దార కలిపిచ్చెదను.

రామం—కొంతలో కొంతనయమే. ఈనాటిపతివ్రతలు కొందరు భర్త
లను వశముచేసికొనుటకు మందులూ మాకులూ కలిపిస్తున్నా
రుతే, అంతపని జరుగలేదు. అదృష్టవంతుడనే అదేమిా అంటే
ప్రమాదో ధీమతామపీ" అని అంటారు.

మాధవ—సీతా! ఘనరాముము గొప్పవాక్యప్రియుడు.

రామం—తమరు వక్యప్రియులు.

సీత—పైగా గానప్రియులు.

రామం—అంతకంటే పైగా నీవు గారెల్లప్రియురాలవు.

సీత—అబ్బా! నన్ను నవ్వించ బోకండి.

రామం—ఏడిపించ మంటావా? ఔనుగాని ప్రయాణం మాట
మరుస్తున్నావా.

సీత—ఎందుకు మరుస్తానూ, సిద్ధముగానే వున్నాను.

మాధ—ఇకముందు యీముసలితాతను మరచిపోతారు కాబోలును—

సీత—తాతయ్యా! మాతాపితృల హృదయాన్ని మిాయందే చవి
చూడగలిగిన మిా యీమానుమతాలు మిమ్ము మరచిపోగలదా?

మాధ—ఇదివరకువోలె నన్ను నీవు మరచిపోకుండా వుండలేవు సీతా!
ఇక మరచిపోక తప్పదు. మరచిపోవలయుననియే నాయాశయం.

సీత—ఆమపుట్టుక పుట్టి మిమ్మాదుర్ఘట సంకటసముద్రమున సంక్షో
భింప జేయుచుంటిని తాతయ్యా మన్నింపుడు.

మాధ—నీకోసమే జీవించాను. తల్లీ తండ్రి లేని పిల్లవని వాళ్ళంతా కన్నులు చేసుకొని పువ్వులలో పెట్టి పెంచాను. పెద్దదానిని చేశాను స్త్రీల కర్తవ్యములైన ఉత్తమవిద్యలను గఱపించాను. నీవు సుఖపడగలవని కోరినవరుని కొవంగి పాణిగ్రహణమహోత్సవాదికృత్యములనుకూడా నెరవేర్చుతున్నాను. సుఖపడుము నన్ను నీవు మరచిపోతేనేగాని నీసంసారముపై నీకు భ్రాంతి హెచ్చుగా కలుగదు.

సీత—నాపుట్టింటపేరట నీవుదక్క నా కింకెవ్వరున్నారు తాతయ్యా! అంధరినీ బావుకొంటిని. (అని అశ్రుల గార్చును)

మాధ—రామం! నీవు సకలగుణాభిరాముడవు మాకు లభించావు. మీకన్నా నాకు మాత్రమెవ్వరున్నారూ. నేడో రేపో కాటికి కాళ్ళు చాపుకొనియుంటిని మీదంపతు లిర్వురూ నన్నింత బూడిదచేసి పోకూడదూ?

రామం—అది అసంభవం, తాతయ్యా! నీవు సీతను వీడుటకెట్లు తల్లడిల్లి పోతున్నావో నాతల్లి నన్ను వీడి యుండుట కట్లు తల్లడిల్లిపోదా — వలయుచో మీసీతను మీరిచ్చవచ్చినంత కాలము మీసన్నిధానముననే నిలుపుకొనవచ్చును. నేనుమాత్రము మాతృదేవిని వీడియుండజాలను సీతపై నాకున్న ప్రేమ మాతృప్రేమయందు మటుమాయమై పోతున్నది.

సీత—తాతయ్యా! ఎప్పటికైనా వారిసొత్తును కాని మీసొత్తును కాను గదా. ఇక నన్ను కాపాడే బాధ్యతకూడా మీకు తొలగిపోయినది.

మాధ—రామూ! మాసీత పతితోడిదే లోకమని తలంచు మహాపతివ్రత నిన్ను వీడి ఒక్కక్షణకాల ముండగలదా. నీకొరకై ఎన్ని

నోములు నోచినదో ఎన్ని వ్రతములు చేసినదో నీకుమాత్రం తెలియదా.

రామం—మాటవరుస కట్లంటినిగాని నిన్ను విడి నేనుమాత్ర ముండ గలనా సీతా! అజాలికన్నుల భాష్పముల జార్పకు.

ఉ. సీతరో నిన్ను మద్హృదయ ♦ సీమలో రత్నసుఖాసనంబుపై
ప్రీతిగ నుంచి నిత్యము న ♦ వీనమనోజ్ఞమహానురాగసం
భూతసుమాళిచేత పరి ♦ పూర్తిగ నెంతటి పూజసేతునో
ధాతకు నీదు తాతకును ♦ తల్పగ శక్యమె ధాత తాతకున్.

సీత—క్షణములో నవ్విస్తారు. క్షణములో యేడిపిస్తారు. అన్నిటికీ తగి వున్నారు.

మాధ—రామూ! పాటకచ్చేరిలకనీ, పండితసభలకనీ సీతను విడి పోలేకుదువు సుమా?

రామం—నేనుమాత్రం! పసివాడనా తాతయ్యా (అని పేపరు చూచు కొనుచుండ మన్మధుడు పెట్టిబేడతో ప్రవేసించి గుమ్మముకడ నిలచి)

మన్మ—సీతా! సీతా! తాతయ్యా! తాతయ్యా!

సీత—(గుమ్మముకడ కేగి) ఎవరువారు?

మన్మ—ఉన్నావా! నేనుకదూ సీతా!

సీత—(ఆనందముతో) మన్మధా! నీవా ఇదే రావడమా! లోనికి రా తాతయ్యగారుకూడా వున్నారు. అబ్బా! ఎన్నినాళ్ళకు చూచి తినోయీ నిన్ను చదువుపూర్తిగానిదే ఈసీతను చూడకూడ దనుకున్నావు కాబోలును.

మన్మ—తాతయ్యా! నమస్కారము.

మాధవు—బాబూ! కుశలముగా చేరుకున్నావుకదా సంతోషం.

రామం—(తనలో) ఈవ్రిబుద్ధు డెవ్వడూ—(మరల పేపరు చదువును.)

మాధవు—బాబూ! ఇప్పు డెప్పటినుండీ నీరాక.

మన్మ—చెన్నపురినుంచే తాతయ్యా!

సీత—(లోనికేగి) కాఫీ తెచ్చియిచ్చెను.

మాధ—పరీక్ష లైపోయినవా?

మన్మథు—(గో)లంతు ఐపోయినవి తాతయ్యా! పరీక్షలో నుత్తీర్ణుడనయ్యాను కూడాను.

మాధ—సంతోషము నాయనా! మీ మేనమామగారిని చూచి వొచ్చావా?

మన్మథు—వారిని యింకనూ చూడ పోలేదు. ఎప్పుడు మియ్యమ్మ కన్నులలో వేసుకుందామాయను యారాటము ముందు నా కీచే దారి చూపించినది తాతయ్యా!

మాధవు—బాబూ! మాపైని యెంత యవ్యాజప్రేమోయీ నీకు—?

మన్మథు—ఎవరిసిద్ధహస్తములవల్ల సీతతో సమానంగా దిక్కులేని యీపరమాణువు నభివృద్ధిలోనికి కొచ్చెను తాతయ్యా! అట్టి మీపైని ప్రేమలేని కృతఘ్నుడు కాడు యీమన్మథుడు.

సీత—(విప్పారిన కన్నులతో) తాతయ్యా! మనమన్మథుని వేషభాషలు పూర్తిగా మారిపోయాయి సుమా! మునుపటిమన్మ మన్మథుడు కాడు. నేడు నవమన్మథుడై పోయాడు.

కామం—(తనలో) ఓహో! నీకంటికి వీ డొక నవమన్మథుడా—?

మన్మథు—తాతయ్యా! మనసీతాయికి మంచిగృహోపకరణములను తెచ్చాను.

మాధ—తెచ్చావా బాబూ! ఏవీ—?

మన్మథు—(పెట్టితీసి) సీతా! ఇదిగో దంతపుబొట్టుపెట్టి, దంతపుదువ్వెన, అద్దం, స్వదేశీ శిల్కుచీరలు. ఇంకా యేమేమి తెమ్మన్నావో

అన్నీ తెచ్చాను. ఇవిగో పుచ్చుకో. అనాడు తెమ్మన్నావు కదూ అన్నీ తెచ్చాను. సంతోషమేనా—?

రామం—తాతగారి పొడుం బుజ్జీ!

సీత—(వస్తువులను గ్రహిస్తూ) మీ వేళాకోళములను పోనిచ్చారు కాదు.

మాధ—బాబూ! సీత నిమిత్తమై యెంతధనవ్యయము చేసితివోయీ.

మన్మధు—ఈధనవ్యయమే కాదు. అవసరమైనచో నాయీప్రాణ పంచకముల సహితముగా సమర్పించుటకు సిద్ధముగా నున్నాను. వీడు తమరు పెంచిన బిడ్డడు కాడా తాతయ్యా?

రామం—(తనలో) నాహృదయగోళమున యేలనో చిన్నతుపాను రేకెత్తుతున్నది. వృద్ధిజెందినా పేదకాపురపుకుటీరమును పునాదులతోసహా యెగర కొట్టదుకదా—?

సీత—మన్మధా! వీ రెవరో నీకు తెలియునా?

మన్మధు—నాకు తెలియదు సీతా! నీవే తెలియచేయాలి.

సీత—నేను పేరు చెప్పకూడదు. తాతగారిని అడిగితే వక్కాణిస్తారు.

రామా—ఎవరి నడిగితే వారే వక్కాణించాలి (తాత వైపునకు తిరిగి) తాతయ్యా గప్‌చిప్.

సీత—పోనియ్! నేనే వక్కాణిస్తాను. జనకుజుని యల్లారు ముద్దుపెద్ద పుత్రిక పేరేమో తెలుసునా—?

మన్మధ—తెలియకేమీ. నీపేరే ఆమె పేరూకూడాను.

సీత—ఆమె పెనిమిటి పేరో—?

మన్మధు—రాముడు.

సీత—ఆపేరే వీరి పేరుకూడాను.

రామం—ఆపేరూ యీపేరూ కలిసి ఒకపెద్దకాసులపేరై పోయిందన్న మాట—?

సీత—ఆమె కాయన యేమి కావలెనో వీరు యీమెకూడా అంతే కావాలి.

రామం—అట్లాగే కారుకదా.

మాధవు—పేరుచెప్పాట కెన్నిగుంజిళ్ళు తీయించావు సీతా!

మన్మధు—ధన్యుడను ధన్యుడను. రామముగారా వీరు. నానేత్రములు మలినరహితమై పోయినవి. నాహృదయలతిక వికసించి పోయినది. కాతయ్యా! వీరి వివాహానికి కడకు పునస్సంధానమహోత్సవమునకైననూ రాజాలకపోయితినే శ్రీసీతారామచంద్రుల దివ్యమంగళస్వరూపముల చూచి యానందింప లేకపోయితినే యనుకొంటూ ఇంత యీనాటితో తీరిపోయినది. నాగాధకూడా వింటారా నేను తిరిస్తాను.

మాధవు—బాబూ! చెప్పుల్లో కాళ్ళు పెట్టుకొని ప్రయాణసంసిద్ధులై వున్నారు.

మన్మధు—రామం! నిజమా! ఈనాడే పయనమై పోవాలెనా?

రామం—అధవా సీతవున్ననూ నేనుమాత్ర ముండుటకు వీలు లేదు. నాకు లక్షవను లుండును.

మన్మధు—రామం! మీరిరువురూ నాకొరకై మరిరెండునాళ్ళుండి పోగూడదూ? తృప్తితీరగా నాగాధ విన్నవించుకొని పరితృప్తుడ నౌతాగా—

రామం—వీలు లేదు ఇప్పటికే మధ్యమధ్య మకాములు చేస్తూ వృధా కాలయాపన చేస్తూ వొచ్చాను.

పోష్టుజవాను ప్రవేశించి—అయ్యగారూ...?

రామం—ఎవరువారు. ఓహో పోష్టుజవాను కాశింగారా.

పో—ఔను బాబూ!

రామం—ఎవరికైనా జాబు లున్నవా?

పో—మీకే జాబువొచ్చింది సార్.

రామం—సరియే లెమ్మి.

పో—చిత్తం. (అని యిచ్చును.)

రామం—(పుచ్చుకొంటూ) ఖాసీం! మదరాసులోవున్న పోష్టుజమాను గారిని చూస్తే నిన్నుచూడ నక్కర్లేదు మూడుమూర్తులా నీవలెనే వుంటాడు నీకేమన్నా కావాలెనా?

పో—ఔను మహారాజ్! వాడూ నేనూ ఏకగర్భజనితులమే.

రామం—సంశయం తీరింది.

పో—శలవుసార్.

రామం—మంచిది పోయిరమ్ము.

(పోష్టుజమాను నిష్క్రమించును రామం జాబు చూచుకొను చుండ)

సీత—జాబు యెక్కడనుంచి వొచ్చిందండీ?

రామం—చెన్నపురినుంచి.

సీత—ఎవ్వరు వ్రాశారో తెలుసుకోవచ్చా?

రామం—అభ్యంతరం లేదు. రాజ్యం వ్రాసింది.

సీత—(చకితురాలై) రాజ్య మెవరూ?

రామం—రేడియో గాయకురాలు. ఉత్తమవంశసంజనిత, అవివాహిత, చిరకాలమునుంచీ చెన్నపురిలో నాతో కలసి గానవిద్య నభ్యసింపుచున్నది. చనిపోయిన నాపితృవకు ప్రియమిత్రులైన డాక్టరు నారాయణరావుగారి సుపుత్రిక—

సీత—మరచేపోయా! తమరి ఛాయావటమును చిత్రించి బహుమతిగా యిచ్చిన ధన్యురాలు ఆమేకదూ?

రామం—ఔనౌను. ఆమే.

సీత—ఏమివ్రాసినదో మే మొల్లరమూ వినవచ్చా!

రామం—నిరభ్యంతరంగా వినవచ్చు, వినండి...

చ. మనలను మించి పొడగల ♦ మానవమాత్రులు లేరటంచు నీ
దినమున పండితోత్తములు ♦ దివ్యముగా సభ సల్పి రండటం
చనగను సన్మతించితిని ♦ యిచ్చట పుట్టము లెన్ని యద్దినా
మనవిని తోసి పుచ్చకను ♦ మంగళవారము కైన రమ్మికన్.

ఇట్లు రేడియోగాయకురాల్ను, కవితిలక రాజ్యం—

సీత—(తనలో) హృదయగోళమున యనుమానపెనుగాలి వీచుచున్నది తుదకు గాలివానయై అనురాగపుమ్యారాగపిటకలతో కట్టుకొని యున్న మదీయదివ్యభవనమును మింగిపోవదుకదా.

మన్మ—రామం! నీవు రేడియో గాయకుడవుకూడానా యేమి?

రామం—ఔను... అన్నిట్లో నున్నాను.

సీత—ఆమె అవివాహితకదా! మీతో స్వేచ్ఛగా విహరింపుచుండ ఆమెతల్లిదండ్రులు మిన్నకుండిరా?

రామం—ఆమె నాగరికురాలు. ఆమె తలిదండ్రులూ నాగరికులే అందువల్ల సంశయించరు.

మాధవు—రామూ! రేపోమాపో.

తే. పుత్రవంతుడవో పూర్వ ♦ పుణ్యమునను
పుత్రికావంతుడవో యగు ♦ పుణ్యదినము
లింక రానుండ యింతలో ♦ యిట్లు నీవు
పరుగులెత్తుట తగునె వో ♦ పద్మనయన.

రామం—నాకుమాత్రం తెలియదా తాతయ్యా! శలవు. నే నీబండికే పయనమై పోవలయును. సీతా! నాదుస్తులను సర్దిపెట్టుము. వలదు వలదు నాదుస్తులు కొన్ని యిచ్చట కలవు.

సీత—నేనుమాత్ర మిచ్చటుండుటకా—? నేనూ మీతో వస్తా...

రామం—సీతా! నీ విప్పుడు రావలదు. రాతగవు. శరీరకొప్తే కొంచెం మిక్కిలి ధనవ్యయముకూడా.

సీత—ఇక మిమ్ము విడనాడి ఒక్కత్రుటికాలమైననూ నిలంప లేను.

రామం—నిన్ను విడనాడి నేనుమాత్ర మిచ్చట దీర్ఘకాల ముండగలనా ప్రస్తుతము నీవు వచ్చుట సమంజసము కాదని చెప్పుచుంటిని.

సీత—నేను అమాయకురాలనుగాను మాయ చేయుటకు.

రామం—నేను గాయకుడనుగాని మాయకుడనుగాను మాయ జేయుటకు. నామాట వినుము.

సీత—మీమాటలు అతూరాలా వింటాను. కాని నామనవికూడావినండి.

సీ. విభులను విడనాడ ♦ శుభముగాదని రామ
విభునితో భూపుత్రి ♦ వెడల లేదె
పతులను విడనాడ ♦ పరువుగాదని పంచ
పాండవుల యర్ధాంగి ♦ పరువు లిడదె
మగనిని విడనాడ ♦ మగువకు తగదని
చంద్రముఖ పతితో ♦ చనగ లేదె
నాధుని విడనాడ ♦ న్యాయంబుగాదని
దమయంతి నలునితో ♦ తరల లేద

తే. ఎందరెందరో కులసతు ♦ లేగినట్టి
పధము వెంటనె యేనును ♦ పయనమగుచు
వచ్చుదానను ఓనాధ! యిచ్చదీర్పు
వడ్లతో గంప యొండగా ♦ జలదెజగతి ?

రామం—సీతా! నామాటవినుము. అదిగో పొగబండి వొచ్చు వేళ యైనది. పోయివొస్తా తాతయ్యా! శలవు. మన్మధా మరల కలసికొంటా. సీతా! విచారింపకు! అదిగో అశ్రులనే గిలకల భావిలోనుండి అవ్వాదేట్టువ నీళ్ళుతోడి పోస్తున్నారు. వలదు సుమా—పోయివస్తా. (అందరూ నిర్జీవప్రతిమలవోలె నిలచిపోవుదురు. అశ్రువుల నిరోధముచే చాలా దూరమువరకూ చూడజాలక గాలిలోని దీపములాగు కదలిపోవుచుండ.)

తెర వ్రాలును.

# తృతీయరంగం.

(చెన్నపురి—భైరవశాస్త్రి—పూజామందిరం)

అనుబంధం.

లింగా నీదరిశన మెవ్వాడుచిక్కు—
లింగా నీదరిశన మెన్నడుగలుగు
లింగా నీదరిశన మెట్టులదొరకు
వెండికొండామీద నల్లగుండూలాగుండే
లింగా నీదరిశన మెవరికిచిక్కు— ॥లిం॥

లింగా నిన్నుగుఱించి ఉగ్రతపస్సుతల్ల క్రిందుగా చేయుచున్న భవదీయకింకరుడైన భైరవశాస్త్రికి దరిశన మీయవా పాపభయంకరా!

పో—జమాను ప్రవేసించి చూచి. నాపేరు పకీర్రైతే ఈయన శంకరా ఘింకరాయని హుూంకరిస్తాడెందుకూ. ఇంకా యేమంటాడో ఈ ప్రక్కనేవుండి అంతా వింటాను.

భైరవుడు—హిరణ్యాక్ష హిరణ్యకశిపులకన్న ఘోరుడనా యీశ్వరా?

పో—తూత్! హిరణ్యాక్ష హిరణ్యకశిపుడ నంటాడేమిటీ — అశంఖ వూదటమెందుకూ. అజాగంట కొట్టటమెందుకూ. ఇప్పటికే ఇతర్లకొంపలు తీసింది చాలక ఇంకా తీయాలినని శ్యామాలి.

భైరవు—సాంబశివా! నాదావాలన్నీ గెలిపిస్తే నీకు భోగాలుచేయిస్తా.

పో—అచ్ఛా! అచ్ఛా! నాకు అంతా అర్ధమైపోయినది. వీడి వృత్తిలో ఇన్నిదురుద్దేశ్యాలుంటే దేశం యెట్లా సుభిక్షంగా వుంటుందీ—

భైరవు—లక్షాధికారుల నందరినీ భిక్షాధికారులుగా జేసి ఇంకా ఒక కోటి లక్షలూ నాకు భిక్షపెడితే నీకు లక్షభక్ష్యాలు చేయిస్తా. ఉన్నవాడన నీ నున్నగా నున్నానని యేడ్చే బిక్కమొగపు బక్క వెధవాయలను ఇంకా యెంతయేడిపిస్తే నేను అంతనంతో పిస్తాడోయి నాగభూషణా!

పో—ఎంతసేపటికీ లోకుల కొంపలార్పాలనియేగా యీన కొంగజపాలు. కానియ్యి! కానియ్యి ఈ వేళకు యీ వుత్తరాలు యింట్లోవున్న ఆడంగుల కిచ్చిపోయి ఆపైవీడికి బుద్ధివచ్చే మార్గమాలోచించు కుంటా (అని నిష్క్రమించును)

భైర—హరోమ్! హరహర మహాదేవా (అనుచుండ) తెరవ్రాలును.

## చతుర్థ రంగం.

(చెన్నపురిలో రేడియోగానానంతరం ఇంటికొచ్చి రాజ్యం సాయంసమయమున డాబాపిట్టగోడ లేక ప్రహారీపిట్టగోడపై కూర్చొని చంద్రుని కేసి చూస్తు)

అనుబంధం.

చుక్కలరథములో
ఎక్కి చక్కంగాను
దిక్కులన్నియు చూచియీ
ప్రక్కకే వచ్చితివ చందురూడానీవు
చిక్కకుంటివియేలా చందురూడా ॥చు॥

పువ్వు బెదనయ్యొయ్యొ
పులకరింపగ జేసి
పూవుతీగెలతోడ
పూబోణ్ణి బందెగా
చేయబూనితి వేమి చందురూడా నీవు
చిక్కు కంటివియేలో చందురూడా ॥చం॥
మన్మనో చంద్రుండు
నన్నేలు యింద్రుండు
మా రామచంద్రుండు
అమృత గుణసాంద్రుండు
అరుగుదెంచెడిదాక చందురూడా నన్ను
అలయింప జేయకోయ్ చందురూడా ॥చం॥

ఆహా రామము యీనా డెంత యమోఘముగా పాడినాడూ! కేవలము తుంబురుడో లేక నారదుడో యీ యవతారమెత్తి నాడుకాని సామాన్యమానవుడు కాడని తోచుచున్నది. వలనో యీనాడు నాలో క్రొత్తవింత యవ్వన రేఖ లెన్నెన్నో తొలకరించి వొళ్ళంతా జల్దరింప చేస్తున్నవి. ఇన్నాళ్ళటిలాగా కాకుండా రామాన్ని యింకోవిధంగా వాడుకోవాలిననికూడా వుబలాట లూగిస్తున్నది. సమంజసమే నా—

సీ. మత్తకోకిలలార ◆ మాప్రేమబీజంబు
వర్ధిల్లగీతికల్ ◆ పాడరాదె
శుకమహాంగనలార ◆ శుభమంగళంబని
దీవించి మాచెంత ◆ తిరుగరాదె
మధువంబులార మా ◆ మనములు రంజింప
జేతుమంచనిగోల ◆ చేయరాదె

మలయమారుతుండ నీ ♦ మధురడోలికలలో
డోలింతునని మాకు ♦ తెలుపరాదె
తే. తళ్కుతళ్కని మెరయువో ♦ తారలార!
మొక్కుచున్నాను నాకోర్కె ♦ చక్కగాను
నెగ్గునంచని కల్కిను ♦ నేర్పిమీరు
నూనవర్షామృతముజిల్కు ♦ చూడరాదె.

రామం—(ప్రవేసించి చూచి) బహువిధప్రసూనములమధ్య ప్రకృతికాంతయో యన యెంత బాగుగా ప్రకాశిస్తున్న దీబంగారుబొమ్మ ఆహా!

సీ. అధరనముద్భూత ♦ హాసాంకురంబులు
కెంపులమోవితో ♦ సంప్రదింప
అడుగిడినపుడల్ల ♦ కడువడి లోలకుల్
కులుకుచు చెవులతో ♦ కూడియాడ
పయిడంచు చేనేత ♦ పట్టుచీరెచెరంగు
పాదపద్మములతో ♦ పాటునాడ
ఆరియారని యూ ♦ యార్ద్రనీలాలతో
నంపెంగపూవులు ♦ సరసమాడ
తే. చైత్రమాసంపు మహాలక్ష్మి ♦ ఛాయయనగ
నేడు విస్తారగంభీర ♦ నేత్రియగుచు
పూలమొక్కల నడిమధ్య ♦ పుష్పగంధి
యేలుచున్నది యవ్వన ♦ శీలపురిని.

రాజ్యం—చంద్రా! నీవైన మారామచంద్రునకు చెప్పకూడదూ?

రామం—రాజ్యం! రాజ్యం!

రాజ్యం—(చూచి) వచ్చావా రామూ! చంద్రునికొరకై నిరీక్షించు చకోరమువలెనే నీకొరకే నిరీక్షిస్తున్నా! దయచెయ్యి!

రామం—చీకటిని చించుకొని శీఘ్రముగా చనుదెంచుచున్న యాచంద్రునిమాడ్కి ఈరామచంద్రుడుకూడా అజ్ఞానాంధకారాన్ని పోద్రోలచేయజాని కోస్తున్నాడు.

రాజ్యం—నేడింత ఆలశ్యమైనదేమిరామూ!

రామం—మిత్రులతో ముచ్చటించి వచ్చుటచే కొలదివ్యవధియైయుండ వచ్చును.

రాజ్యం—అలా నిల్చి యుంటివేమి. రామూ ఈపిట్టగోడపై కూర్చోని స్తిమితముగా మాటలాడుదము.

రామం—రాజ్యం! పచ్చపువ్వువలె చంద్రకాంతి నయనానంద మొనర్చుచుండెనుసుమా!

రాజ్యం—ఔనౌను! అప్పుడప్పుడు ఆలేతమబ్బులు చంద్రుని కౌగలించు కోడానికి స్వాగత మిస్తున్నాయి.

రామం—హరి! హరి! దూరమునుండి మేఘపంక్తి చంద్రుని ముంచుటకు మహావేగముగా పరుగు లెత్తుచున్నది.

రాజ్యం—శివ! శివ! ఆమేఘపదవి కాకుడునకు చంద్రుడు చలించి పోవడుకదా.

రామం—చంద్రుడు తక్కువబంటా! ఎన్ని డక్కాముక్కీలు తిన్నాడో చూడూ వాటిని లయింపచేసుకొన తనస్వేతకాంతి పుంజముల ద్విగుణీకృతముగా విజృంభింప జేయుచున్నాడు.

రాజ్యం—ఇట్టిసమయముననే మనపువ్వెదలలో దాగియున్న పువ్వుల హారతిపాటను చంద్రునకు వినిపింతామా.

రామం—ఔను. ఇట్టిమధురసాయాహ్నమందే పువ్వులహారతివ్వాలి.

రాజ్యం—బిల్హణ యామినీపూర్ణతిలకలుకూడా యిట్టియమృతఘడియలల్లోనే సుధాకరునకు సుభహారతుల యిచ్చారుట.

రామం—ఏదీ నీవు రచించుకొనుచున్న గీతికను ఆచంద్రునకూ ఈ రామచంద్రునకుకూడా వినిపించూ వింటాము.

రాజ్యం—ఓవ్ పాడతాను రతీదేవిలాగు పాడతాను. మన్మథునిలాగా వింటానంటే.

రాజ్యం—సరస్వతి పాడుతుంటే బ్రహ్మమైనవాడు వింటున్నట్లు వింటాను.

చుక్కల రథములో
ఎక్కి చక్కంగాను
దిక్కులన్నియు చూచియా
వ్రక్కకే వచ్చితివె చందురూడా నీవు
చిక్కకుంటివియేలా చెందురూడా.
యవ్వనసముద్రంబు
దవ్వుదవ్వున కొచ్చి
కెవ్వు కెవ్వున నేడ్చు
పువ్వుబోడిని క్రిందం
రివ్వుమని వొస్తుంటె చందురూడా పైన
నవ్వుతూ చూతువా చందురూడా ॥చు॥

రామం—(స్తబ్ధహృదయుడై కూర్చొనియుండ)

రాజ్యం—రామం! అలా స్తబ్ధహృదయుడవై పోయావేమీ—?

రామం—ఏమీ లేదు. గృహసామ్రాజ్యపట్టభద్రుండైన యీరామ భద్రునికొరకు మంత్రిని యెదురు చూచుచుందును. నేను పోవాలి. (అని లేచును)

రాజ్యం—రామం! నీమాటలు నా కర్థ మగుట లేదు. అసలువిషయ మేమో నాకు విపులముగా చెప్పకూడదా?

రామం—రాజ్యం! నేనొచ్చి చాలదినము లైపోయినవి. ఇక నిలచుటకు నాకు వ్యవధి లేదు. వెడలుట కనుజ్ఞ యిమ్ము.

రాజ్యం—ఈగృహంబున వ న్నొంటరిగా గబ్బిలాల కొప్పగించి పోయెదవా రామం.

ఉ. ఏగతి నీవు లేక క్షణ ♦ మేగును యీమదరాసులోన నే
నేగతి నేర్పుగా తమరు ♦ నేర్పిన యీవధూయార్ద్రగీతికల్
బాగుగ వీణతో గలపి ♦ పాడగ నేర్తును భావ మొప్ప నీ
వేగతి జూపి నా కికను ♦ యేగదలంచితో తెల్పరాసఖా!

రామం—రాజ్యం!

చ. మునుపటివోలె నే నిపుడు ♦ ముచ్చటగా యిచటుండ చెల్లదో
వనరుహనేత్రి! నాకొఱకు ♦ వారమురోజులనుండి యెంతయో
పెనుదిగులొందువారచట ♦ పెద్దలు వృద్ధుడి యేమిసేతు, నా
మనవిని యాలకించి యను ♦ మానములేకను పంపు మిత్రరిన్.

రాజ్యం—రామం! నిజంగా పోవాలిసిందేనా?

రామం—నిజం రాజ్యం! నాకొఱకు క్షణ మొకయుగంబుగా తలంచి వాపోవువారు కలరు.

రాజ్యం—మరల మనయిరువురిసమా వేశ మెప్పుడూ!

రామం—మరి రెండు నెలలకు రేడియో పాటకచ్చేరీ నిర్ణయింపబడినది. గనుక అప్పటికి రాకతప్పదు.

రాజ్యం—రెండు నెలలకా! అబ్బా! ఎంత దీర్ఘకాలమూ. అంత దీర్ఘ కాలము ఏకాంతముగా నే నుండగలనా రామం! నీయుండ మాదికదా మావాండ్రు ఈచెన్న రాజధానిలో నివాసముం చిరి. అదిగాక రామూ—

తే. గాయికీగాయకుడు ధర ♦ కలసి తిరుగ
మానసికచింత లన్నియు ♦ మానిపోయి
సతము గానసుధామృత ♦ సరసిలోన
స్నానమాడుదు రనిగదా ♦ సరసు లనుట.

కావున నేనుకూడ మీతో వస్తాను

రామం—తప్పు రా తగదు.

రాజ్యం—ఎందువల్ల?

రామం—నీవు స్త్రీవి. నేను పురుషుడను.

రాజ్యం—స్త్రీ పురుషునివెంట రా తగదా?

రామం—పరపురుషునితో రాకూడదు.

రాజ్యం—పరపురుషుడు కానిదే తనపురుషు డెట్లగును?

రామం—వివాహమువల.

రాజ్యం—పరపురుషుడను కానని చెప్పుము నేనుకూడా పరస్త్రీని కానని చెప్పుకొందును.

రామం—హరి! హరీ! అది నాకు పాపంకాదా రాజ్యం.

రాజ్యం—శివ! శివ! ఇందు పాపమే మున్నది. ఒకస్త్రీ ఒకపురుషునకు సర్వస్వం వొప్పగించుట పాపమా.

రామం—రాజ్యం! ఇట్టిమాటలు ఎన్నడైన ఉచ్చరించితివా?

రాజ్యం—ఇదివరకున్న స్థితిలో యిప్పుడుంటినా రామం.

రామం—ప్రేమ కిన్నిమార్పు లెందుకో తెలుసుకున్నానని చెప్పితే చాలదా దాని కేడాంకతిరుగు డంతా యెందుకూ.

రాజ్యం—ప్రేమ కిన్నిమార్పు లెందుకో యనుభవమువల్లనే తెలిసికొంటిని. నీవుకూడా నావలెనే తెలిసికొనే వుంటావుగా. ఇక ప్రేమించుకొంటే మాత్రం తప్పేమున్నదీ—

రామం—తెలిసికొనగలుగుదును మరియొకవిధముగా—

రాజ్యం—ఇప్పుడు నేనునూ మరియొకవిధముగనే ప్రేమించుచుంటిని.

రామం—ఇది తాత్కాలికప్రకృతోద్రేక జనితభావ విహ్వలత కానిచో నీ వేమీ కన్న యీరీతి ప్రేమించుటేమి. నీహృదయము నే నెఱుంగనా.

రాజ్యం—రామం! నామనస్సత్యం జారిపోయినది నాఅంతర్యాన నీ
శరీరస్పర్శ కావలెయునని నన్ను విడనాడియుండ లేనని బలవం
తము చేయుచున్నది కావున నీహృదయాకాశములో తృప్తా
విమానముపై తనివితీర నన్ను స్వేచ్ఛగా తిరుగనిమ్ము.

రామం—వీలు లేదు యిదివరకే ఒకఅంగనామణి కంకితమై పోయింది.

రాజ్యం—యథార్థమా?

రామం—ముమ్మాటికినీ యథార్థమే.

రాజ్యం—ఐతే కావచ్చు. అందులో కొంచం తావీయుండి యీ అంగనా
మణికికూడా.

రామం—నాతల్లి పతివ్రత. నాతండ్రి యేకపత్నీవ్రతుడు. నాదీ యేక
పత్నీవ్రతమే కనుక నీహృదయాన్ని మరల్చుకో. నాలో తావు
లేదు.

రాజ్యం—రామం! చాలా ఆశ్చర్యంగా నున్నవి నీమాటలు పైగా
కవికుమారుడవు నీకు నేను చెప్పాలా! నీకు తెలియదూ?

సీ. ధరణి పాలించిన • దశరథమహారాజు
ఏకపత్నీవ్రతం • బేల విడిచె?
గోకులధనుడైన • గోపాలకృష్ణుండు
ఏకపత్నీవ్రతం • బేల విడిచె
రహిని పాలించిన • రాజరాజనరేంద్రు
డేకపత్నీవ్రతం • బేల విడిచె?
అఖండధర్మాత్ముల • వరయుగల్గిన చంద్రు
డేకపత్నీవ్రతం • బేల విడిచె?
తే. మేటివిలుకాడు యర్జునుం • డేటికవును
ఏకపత్నీవ్రతధర్మ • మేల గలిపె?

ఇతరులకు చెప్పెదరు కాని • యిట్టివ్రతము
కాచుచేయగ లేరు స్త్రీ • జాను లగుచు.

రామం—బహుపత్నీవ్రతులమై పలుబాధలు పడుచుంటిమి కాన మన్మందు మీరు ఏకపత్నీవ్రతులై సుఖంపుడను యాదర్శమున కట్లుచేసి యుండవచ్చును రాజ్యం!

రాజ్యం—అటకనిమాటలు చెప్పి అభినవశాకుంతలనాటకములో నన్నేల చిత్రాంగిపాత్రను వేయించి నీవేల సారంగధరుడవై పోవుదవు రామం. దుష్యంతునివేష మేయుము. కథ రక్తి గట్టును.

రామం—రాజ్యం! ఇన్నినాళ్ళనుండియూ లేని యీభౌతికవాంఛ తాత్కాలికసుఖము సుమీ ఇది లేనందున మన మిరువురమూ సగౌరవముగా సంచరించితిమి. ఇప్పు డిది కోరితిమేని పలువురకు లోకువైపోదుము. తుదకు నాకు నీవు మహాలోకువై పోదువు.

రాజ్యం—రామం! నే నేమి చేసేది! ఇదివరకు నీచే గౌరవింపబడితిని. ఇప్పుడు యౌవ్వనసముద్రమున దిగబడి దరిగానక తల్లడిల్లిపోవుచుంటిని. ఇదివరకు లేని వ్యామోహాలు ఉత్తరక్షణమున సముద్రమునం దుత్తుంగతరంగములరీతి యావిర్భూత మగుచున్నవి.

రామం—రాజ్యం! భౌతికవాంఛామృగతృష్ణమున బడి యుక్తాయుక్తములు మరచి పలువరించుచుంటివి. త్వరలో రాగద్వేషక్రోధాసూయలివ యాది మహారోగములకు దివ్యతరమైన ఔషధాన్ని సేవింపుము తరించగలవు.

రాజ్యం—రామం! పైత్యరోగికి పరమాన్నం పెట్టినట్లున్నవి నీమాటలు.

ఉ. కొంచిలి కాని చిన్నదోక • ప్రేమమహావిరహాగ్ని మధ్యమం
దెంచుచు వాడుచున్ కరుణ • దేలుమటంచన దుష్టయవ్వనో

చ్ఛందతరావ్రవాహాధర ♦ సాగరమందున తోయు నెంచితో
పండిత శ్రేష్ఠమా తగునె ♦ పల్కుచు నుమ్కువితర్కవాదముల్.

రామం—రాజ్యం!

ఉ. చక్కటిశాస్త్రములఁ జదివి ♦ సర్వ మెఱింగియు స్వల్పకాంక్షలీ
వక్కట కోరగా తగునె ♦ యజ్ఞులరీతి విచార మెందకా
తక్కన చింతలేల విను ♦ తల్లియు తండ్రియు కల్గియుండ నీ
విక్కడ యిట్టిచేష్టలకు ♦ యింపు ఘటింపగ తప్పు కాదొకో.

రాజ్యం—రామం! నాతల్లిదండ్రులు నాకు సర్వస్వాతంత్ర్య మిచ్చి స్వేచ్ఛాజీవిని చేశారు. నాతనుమనములపై వాక్కు నాయధీనములోనే నున్నది.

రామం—అదియే వారు చేసిన తప్పు.

రాజ్యం—అదియే వారు చేసిన వొప్పు.

రామం—హరి! హరీ! ఎంతపాపకాలము సంభవించినది.

రాజ్యం—భళి! భళీ! ఎంత పుణ్యకాలము సమీపిస్తున్నదీ.

రామం—రాజ్యం!

రాజ్యం—ఏమి రామం!

రామం—చూడూ.

చ. ఇదివఱ కెన్నడేనియును ♦ యిట్టుల నీ స్థితి యౌనటంచు నా
మొద తలపోయనైతి జామి ♦ యొంతయు మానము దాసె నేమి సే
యుదగు విషాదమానసికి ♦ యోాతనమార్గము త్రొక్కుటెట్లు నీ
హృదయము మారుటెట్లు జప ♦ హృద్యముకానిది చేయుటెట్లకో.

రాజ్యం నీవు అరణ్యామధ్యమందున్న దేవప్రసూనమని నా మొద స్మరించితినేగాని బహువిధపుష్పములమధ్య పరిమళ సూన్య సౌరభయుక్తమైన పచ్చపువ్వువని గ్రహించుకో లేకపోయాను.

రాజ్యం—రామం! పొంగుచున్న యీ వ్యామోహసముద్రానికి సేతువును కట్టించగల రామచంద్రుడవని తలంచితినిగాని స్వార్థపరాయణుడైన యేరావణునికో ఒప్పగింప నెంచిన విశ్వాసహీనుడవని తలంపలేకపోయాను—రామం!

ఉ. మోహసముద్రమధ్యమున ♦ మోహనగాత్రిని త్రోసి పోవగా
ద్రోహముకాదె జీవనథ ♦ దోసిలి యొగ్గెద భిక్ష పెట్టుమీ
దేహము నిల్వబోదు నను ♦ దేల్పుమి యేగగ న్యాయమౌనె న
న్నాహుతి జేసి పోయి కడు ♦ హాయిగ నుందువె రామచంద్రమా.

రామం—అంధురాలకు అద్దమిచ్చి చూచుకోమ్మన్నట్లు నామానసిక ప్రేమతత్వప్రబోధము గాఢానురాగ దోదూయమాన హృదయురాలవగు నీకు రుచింప జాలదు కనుక నన్ను పోనిమ్ము.

రాజ్యం—వీడజాలను.

రామం—ఏమి చేస్తావు.

రాజ్యం—అస్మదీయమృణాల సన్నిభబాహుద్వయముచే నీకంఠము బిగించి ముఖాన్ని ముద్దులచే కడిగేస్తాను.

రామం—మంచిపనే చేస్తావు.

రాజ్యం—మోవితేనియను జుర్రేస్తా కూడాను. (అని సమీపించి) హాయ్! హాయ్! నీస్పర్శాసుఖ మెంత హాయి చేకూర్చిందీ...?

రామం—ఐనదా! నీకోర్కె తీరిందా! దీనినే పశుతత్వ మంటారు.

రాజ్యం—కాదు దీనినే మానవసహజమైన కృత్యమని తారాశశాంకులు ఉద్ఘాటించారు.

(పోష్టుజవాను ప్రవేశించి) బాబయ్యా! బాబయ్యా!

రామం—ఎవరువారు. పోష్టుజమానువా?

పో—ఔను బాబూ! మీకు తంతి వొచ్చింది సంతకం చేసి తీసుకోండి.

రాజ్యం—వినాయకుని పెండ్లికి వేయి విఘ్నాలన్నట్లు ఈతద్దినముకూడా యిప్పుడే రావాలీ.

జవా—(ఇచ్చి నిష్క్రమించును.)

రామం—కొంప మునిగిందీ.

రాజ్యం—కొంప మునిగితే ఘట్టికొంప నాయీ కొంప వున్నదిగా.

రామం—ఇం కేమున్నది.

రాజ్యం—రామం! ఏమున్నదీ! అంత గాభరా పడుతున్నావు.

రామం—నాతల్లికి చాలా బలువుగా నున్నది. సీతను తీసుకొని ఈ వెంటనే రమ్మనమని వున్నది.

రాజ్యం—రామం! సీత యెవరూ?

రామం—అబ్బా! నన్నిప్పుడేమియూ నడుగకు నాకు మతి పోయినది. నే నిప్పుడే పోవాలి.

రాజ్యం—నాకుమాత్రం మతి పోకుండా వున్నదా. కావున మతులు పోగొట్టుకొన్న మనయిరువుర మేకమై పోయినచో అశోవహాతు లము కాకుండా వుంటావను.

రామం—వలదు! వలదు.

రాజ్యం—పోవలదు! పోవలదు.

రామం—న న్నాపకు. (ఆననూ అగక తోసివేసి రామము నిష్క్రమించును. రాజ్యం నేలపై బడి లేస్తూ)—

రాజ్యం—రామం! ఎంతమోసం చేసి పోతున్నావూ.

క. ఈవవజాజివూవును వ ♦ రింపక యొట్టుల పీడువా డటం
చే నిట యోజ చేసితిని ♦ యెన్నొ తలంచితి శుద్ధమొద్దుతో
కానక సంచరించితిని ♦ కాళ్ళకు వేళ్ళకు మొ్రొక్కి షు్రొక్కితి
హీనత జూచి యేగె గుణ ♦ హీనుడు రాముడు క్రూరు డయ్యొనే.

(కొటికొటి చందు్రనికేసి చూస్తూ)

చుక్కల రథములో
నెక్కి చక్కంగాను
దిక్కులన్ని చూచి యీ
పక్కనే వచ్చితివా చందురూడా నీవు
చిక్కకుంటివియేలొ చందురూడా ॥చు॥
సూర్యగృహమున నేను
సుష్కించి పోతుంటె
శుద్ధపౌర్ణమినాడు
శుంఠవేషాలేసి
చూచి పోవచ్చితివా చందురూడా నీవు
చులకనై పోయితివి చందురూడా ॥చు॥

తెర వ్రాలును.

## పంచమ రంగం

భైరవశాస్త్రి పూజామందిరం.

లింగా నీధ్యానా మెంతో సౌఖ్యం
నీసేవ లెంతో మోక్షం
నీశూల మెంతో స్థూలం
నీకాయ మెంతో వజ్రం ॥లి॥
న న్నేలువంతు నీది
పూజించు వంతు నాది
నైవేద్య మంతా నీది
తిండాన్కి వంతు నాది ॥లిం॥

కాలభైరవా ఈభైరవశాస్త్రిపై నీకృపాకటాక్షవీక్షణాలిని బఱపి ఇంకా నన్ను బలిపించి, కులికించి, పులకించీ, పులిపించి పోయే టట్లు చేయవా విశ్వనాథా! ఛీ! ఛీ! నిజముగా నీవు యీశునవు కావు పాషాణునవు. ఆత్రిశూలం నీకెందుకూ నా కిచ్చి పారెయ్యి, ధనికుడననీ ధనాశనమత్తగజేంద్రతుల్యుడననీ యేచ్చిపోయే యీవరిదిద్దమ్మ పెద్దమ్మ పుత్రులను ధ్వంసం చేసి నీకు ధ్వజారోహణమహోత్సవం బంర్ఘ్యామృతముగా కొనసాగిస్తా.

పోష్టుమేన్—లింగావతారముతో (ప్రవేశించి) ముండావాడు కండ్లు మూసుకొని ఎంతబాగా హూంకరిస్తున్నాడూ వీడిభరతం పడతాను.

భైరవ—నీయొక్క వేమిటో చెప్పు స్వామీ! నీకు త్రిశూలంవుంటే నాకు కడుపుశూలం వున్నది. నీకు త్రినేత్రాలుంటే నాకుచత్వారపుజోడుతోనహా నాలుగు నేత్రాలున్నవి. నీకు పుర్రెవుంటే నాకు నశ్యబుఱ్ఱవున్నది. నీకు బొజ్జవుంటే నాకు గుజ్జువున్నది. నీకు కొండవుంటే నాకు గోడ అండ వున్నది. నీకు శక్తివుంటే నాకు యుక్తి వున్నది. నీకు గంగవుంటే నాకు మంగి వున్నది. నీకు పాములుంటే నాకు దోమ లున్నవి. నీయొక్క వేమిటో నాకొక్కటియూ తోచుట లేదు. నిజముగా నీవు స్వామివైతే ఏదో ఒకరూపమున ఇక్కడ తక్షణం ప్రత్యక్షపడి లక్షవరా లిచ్చి నేనిచ్చినన్ని భక్ష్యాలు పుచ్చుకోని పోవోయ్ లింగా లింగ లింగ లింగ మహాలింగా.

పోష్టు—బిడ్డా! లింగడు సాక్షాత్కరించాడు చూడు.

భైరవు—లింగనిరూపముతోనున్న పోష్టువానిని చూచి హా లింగా! లింగ లింగ మహాలింగా నీనిజస్వరూపమును నాకు చూపితివా.

పోష్టు—భైరవా! నీభక్తికి మెచ్చితిని. హరి బ్రహ్మేంద్రాదులకు కూడా దుర్లభమైన నాదివ్యస్వరూపమును నీకు చూపుచుంటిని. చూడుము. నీయిష్టము వచ్చినట్లు చూడుము. చూడదలచు కున్నదంతా చూడుము. ఈలింగణ్ణి ఎంత చూస్తే అంత మోక్షం చూడు.

భైర—చూస్తున్నా లింగా! ఎంతచూచినా తనివి తీరదుకదా మహా లింగా. (పాడుతూ ఎగురును)

లింగా నీదరిశన మెవరికి దొరుకు
లింగా నీదరిశన మెట్టుల చిక్కు
లింగా నీదరిశన మెవ్వరికి దక్కు
వెండికొండామీదా కొబ్బరిబొండాంవలె నుం
డులింగా నీదరిశన మెవరికి దొరకూ.

పోష్టు—భైరవా ఈలింగేశ్వరునివల్ల నీకు కావలసినసహాయ మేమిటి.

భైరవ—కోట్లింగా! భక్తత్రాణపరాయణుడవని ఈభైరవశాస్త్రి కోర్కె విడేస్తువనీ పిలచితిని.

పోష్టు—నరే మంచిదే. నీకు యేమేమి కావాలో కోరుకో.

భైరవ—పరదుప్రిలధాటికి తట్టుకో లేకుండా వున్నాను.

పోష్టు—తట్టుకో లేకపోతే ఈలింగాన్ని పట్టుకోవటమెందుకూ అంట.

భైర—నాకు ఒకలక్షవరాలిస్తే తట్టుకుంటా లింగా.

పోష్టు—లక్షవరహాలే.

భైర—వరహాలుగాదు. మహాప్రభువరాలు.

పోష్టు—ఓహో వరాలు కావాలెనా నీకు.

భైర—ఔనా మహాశివా!

పోష్టు—ఐతే ఒకసందేహ మున్నది.

భైర—తలవియ్ శంకగా శిరసా వహిస్తాను.

పో—నీవద్ద పిశాచపుసొమ్మున్నదోయ్ ముందు అది పోవాలె.

భైర—అది యెట్లా పోతుందది స్వామి

పో—దరిద్రులకు ఉచితముగా ఉన్నదంతా యిస్తే పోతుంది.

భైర—ఆప్రకారమే చేస్తాను.

పో—అట్లాగే చేస్తే మరల నీకు ప్రత్యక్షపడి నీకు లక్షవరాలిమ్మటే కాకుండా నీయింట కుబేరుణ్ణికూడా సేవకావృత్తి చెయ్యడానికి పంపిస్తా.

భైర—కుబేరునకుకూడా పైకుబేరుడినే తాను కావాలి.

పో—(అదృశ్యుడగును)

భైర—ఆహా ఎంతలో అదృశ్యుడైనాడు లింగడు.

తెర వ్రాలును.





ఓం

శ్రీవీరాంజనేయాయనమః.

# యథార్థము

## (లేక పతివ్రత)

### ద్వితీయాంకము — ప్రథమరంగము.

(సీతామన్మథులు కూర్చొనియుండ మధ్య గ్రామఫోను టేబులు పైనుండును.)

మన్మ—సీతా!

ఉ. చిన్నతనంబునుంచి నను ♦ చిత్తమునందున తమ్ముడంచు, నీ
కన్నులలోన పెట్టుకొని ♦ కాచుచునుంటివి ప్రేమతోడ, నే
నెన్నడు దీర్తునీరుణము ♦ నెట్టులదీర్తును వృత్తియైన లే
కున్నది యేమిసేతు యిపు డుర్విని యెయ్యెడ కేగి చూచినన్.

సీత—మన్మథా! చింతిలకుము. మావారు వచ్చినపిదప నీకు వివాహ ప్రయత్నమే కాకుండా ఉద్యోగప్రయత్నమునుకూడా చేయుడని వారిని ప్రార్థించుకుంటాను. నీవుకూడా వారితో హెచ్చరింపుము. వారు చాలా కరుణాస్వభావులు. గాన కళాకోవిదులు. పైగా పలుకుబడి గలవారు. తప్పక కనికరిస్తారుకూడా.

మన్మ—(రికార్డును వేయబోతూ) నీకు నాయందలిగల ప్రేమనుకవులు కూడా వర్ణింపలేరుకదా సీతా!

రామం—ద్వారముకడకొచ్చి ప్రేమ యనుమాట విని చుబుకుదెబ్బ తిన్నగొడువోలె చకితుడై ప్రక్కనదాగి తనలో వీరిరువురి ప్రవర్తనలూ నాకు అనుమానస్పదముగా నున్నది.

ఉ. అరమరలేక యియ్యబల ♦ యుత్తరుతో తలదువ్వి చక్కగా
మరువము క్రీల్జడన్ జొనిపి ♦ మంచిసుగంధము మేనబూసి, బ
ల్మెఱమెఱలాడు సొమ్ములను ♦ మేలుగ దాల్చి మదించి కండ్లకా
వరమున వీనితో నగుచు ♦ వాగుచునున్న దదేమి చిత్రమో?
వినను యీవాతాయనమ్ముల మరుగునుండియే వీరిసంభాషణలను వింటా.

మన్మధు—(ప్లేటును తీస్తూ) సీతా! నాపై నీకెంత దయా! ఎంత ప్రేమా. నిక్కముగా ఈప్రేమకు చలన ముండదుకదా.

రామం—వాస్తవముగా వీరిద్దిరువురికూ ప్రేమబంధ ముండియే తీరును.

సీత—మన్మధా! నీవు ప్రేమింతువూ ప్రేమింపబడుదువు, అసలు నీ హృదయమే ప్రేమహృదయము. నిన్ను అర్ధం చేసుకోగల వారికి నీప్రేమహృదయాన్ని బలిగా సర్పించుకుంటావుకూడా. నీవు ప్రేమించినట్లు భగవంతుడుకూడా ప్రేమింపజాలడు. అట్టి ప్రేమస్వరూపుడవైన నీపై నాకు ప్రేమ లేకుండునా?

రామం—దుర్భరము! దుర్భరము! వినజాల కనజాల. నాహృదయాంబరవీధిలో గాఢమేఘాలు చెడుగుడి యాడుతున్నాయి. అన్నన్నా! యెంతమోసము. అనుకున్నంతైనది.

ఉ. మాయలమారిదంచు యను ♦ మానము జెందక పూరుషుండు మ
త్ప్రేయసి యెప్పుడున్ ప్రథిత ♦ ప్రేముడి లన్నిల జూచునంచు తా

గోయుచునుండు గవ్వముల ♦ గొప్పకు స్త్రీహృదయం బదెట్టిదో
యాయమధర్మరాజయిను ♦ యారయ లేదుగ శిక్ష వేయగన్.

పుష్పమాలయని మెడలో ధరించ తుదకు సర్పమాలయే యైనది.

సీత—(రికార్డు ఆగగా) ప్రేమ యనగా యెట్టిదో దానిస్వభావ మెట్లుండునో దానివల్ల యెంతటి సుఖవంతు లయ్యెదరో నీవలె యా రామాయుడుగూడా నిరూపింప చేయలేక పోయాడు. నీవు నిజముగా ప్రేమావతారుడవు మన్మధా!

రామం—ఎంతటిసాహసురాలవు. ఎంతటి స్వామిద్రోహురాలవే.

చ. అతిపల నమ్మ రాదు తన ♦ యాత్మకు నచ్చని రాజునైన దు
ర్వ్యతలకు నొప్పగించెదరు ♦ నా స్వవ మెన్న ను బల్కుబోరు న
ద్గతులకు దూరమౌచు నం ♦ కాలుని కైనను జంక కిట్టులన్
పతులను మాయ జేసెదరు ♦ పాపపుముండలు గొంద గుర్విలో.

ఛీ! దీనిముఖమైననూ చూడరాదు చూడను దీనిని యీమన్మధునకే సమర్పించితిని. అబ్బా! నాగుండెలపై సీత యిప్పుడొక నిప్పులకుంపటియై పోయినది. హా! నాతల తిరిగి దిమ్మెక్కిపోవుచున్నది. ఈమలినావరణములో ఈఅర్ధమలినాంగములతో నిలువలేను. నిలువరాదు. ఛీ! సీతా! యీరామునుమన్మధునకు వశమైయున్న నీముఖమైనా చూచునా సద్గతికి దూరమై పోవుటయేగాక నాకునూ నీవు దూరమై పోయితివి. పాపిష్టురాలా. నీవీ మన్మధునకే శాపురిము చేయుము. రాముడు నిష్కాముడై హాయిగా జీవిస్తాడు.

(క్రోధముతో నిష్క్రమించును.)

మాధ—(అడావుడిగా ప్రవేశించి) సీతా! సీతా!

సీత—ఎందుకు తాతయ్యా!

మాధ—నీభర్త యత్యంత క్రోధాకులమానసుండై నిల్వకపోతున్నాడేమిటా—?

సీత—(భయముతో) నిజమా తాతయ్యా!

మాధ—నాకు బాజారులో కానుపించి మీయత్తయ్యకు చాలా జబ్బుగా నున్నదనియు, సీతను అర్జంటుగా తీసుకపోవాలిననియు, చెప్పి యింటికొచ్చినాడు. తిరిగి నేను బాజారువనుల నెరవేర్చుకొని గృహోన్ముఖుడనై వస్తూండగా యెదురువడి పిలిచినను పలుకక ఆక్రోశముతో చూచి వెళ్లిపోతున్నాడు.

సీత—ఇదంతా నిజమా తాతయ్యా!

మన్మధ—కారణ మేమై యుండును.

సీత—తాతయ్యా!

చ. మనసున కెద్దియో కలత ♦ మాకొనుచుండెను రామచంద్రుడీ దినమున చేవచ్చియును ♦ తిన్నగ నన్నుల జూడకుండ తా వెనుకకు పోయినారు తెర ♦ నేదిక తాతరా యాత్మలోన యు ద్యానఘున కేమి తోచెనొకో ♦ యాగ్రహ మెందుల కొచ్చెనోకదా.

మాధ—నాకునూ తోచటం లేదు.

మన్మధ—కారణం లేకుండా యెందు కలిగి పోతారూ?

సీత—మన్మధా! నీవు పోయి యెందెందైనా కలరేమో వెతకి బ్రతిమిలాడి తీసుకొని రాగలవా — పొమ్ము......త్వరగా పోండి. తాతయ్యా నీవుకూడా పోయిరా. అబ్బా! ఇంక ఆలోచిస్తారెందుకూ. ఆలసింపక పోయి రాండి. నాకన్నులకు వారిని చూపింపకపోతే మీరింక చూడలేరు నన్ను.

మన్మ—తాతయ్యా పోదాంపద.

మాధ—పోకపోతే యెట్లా పదా.

సీత—(రామునూ పఠమును చూస్తు) ప్రభూ!

చ. పతిపద సేవలే పరము ♦ భాగ్యమటంచని నమ్మికొన్న నీ
పతివయి కోపమేల మన ♦ సారగ చేసిన దోసమేమి యీ
మతి కెటు తోచెనో మగిడి ♦ మంచియు చెడ్డయు తెల్పకుండ యీ
స్థితి నను వీడిపోవగను ♦ చిత్త ము దెట్టుల నొప్పె నావిభూ!

(తెర వాలును)

## ద్వితీయ రంగము.

(రామంతల్లి శాంతమ్మ మరణశయ్యపై నుండ
రాముం సేవ చేస్తు)

రామం—అమ్మా! అమ్మా!

శాంతమ్మ—నాయనా! రామూ వచ్చావా బాబూ! ఎంతసేపైనదీ.

రామం—ఒకయామమునకు పైన ఐనదమ్మా! ప్రస్తుతము నీ కెట్లున్న దమ్మా!

శాం—రామూ! ఇక నేను జీవింపను రా! నా కేమో అయోమయ ముగా నున్నది.

రామం—నీవే జీవింపకున్న నేను దుఃఖజీవిని కానా మాతా!

శాంత—రామూ! నాముద్దులకోడలు సీత యేదీ...

రామం—అమ్మా! సీత యెందుకూ?

శాంత—మిమ్మిరువురి నీకన్నులనిండా అంత్యచూపు చూచుకుంటారా నాయనా...

రామం—అమ్మా!

చ. మునుపటి ముగ్ధ గా దిపుడు ♦ ముద్దులకోడలుకూడ కాదు నా
కనువగు భాగ్యలక్ష్మి యన ♦ సంతస మున్నగ గాదు విన్నవిం

తను విను నీదుకోడ లోక ♦ తుచ్ఛపిలోడను ధర్మ మెంచకన్
తనియుచు నున్నదమ్మ యిక ♦ దానిని మాత్రము తెల్ప కమ్మరో.

శాంత—హరి! హరీ! అట్లనుచుంటివేమి రామూ! వేకువనే యాతల్లి ముఖారవిందమును వీక్షిస్తే జన్మజన్మాల చేసిన పాపం పరిహారమై పోతుంది.

రామం—అమ్మా! చిన్ననాటి గుణాన్నిబట్టి భావికాలచర్యల నూహించలేము. అంకురావస్థలో లేత ఆకుపచ్చ మొదలుగాగల విషవృక్షాదులుకూడా మిక్కిలి రమ్యంగా కనిపిస్తాయి. అద్యంతాని కవి చేదుచెట్లగునని యెవ్వరైనా పోల్చుకోగలుగుతారా మాతా—

తే. ఏది గత్యంతరము లేక ♦ యెట్టులెట్లో
కట్టుబడియున్న దది కొంత ♦ కాల మమ్మ
బాగపచ్చిక మేసిన ♦ పసర మెపుడో
పారిపోకున్నె తెమ్మకు ♦ వదిలినంత.

శాంత—అయ్యో నాయనా! అది ఒకనాడైనా మన చెవికి వెగటుగా సంభాషించిందా. ఒకమారైనా మనచిత్తముల కలుషములగునట్లు వర్తించిందా. దానిస్వభావ మెవ్వ రెరుంగరూ...? నీవుమాత్ర మెఱుంగవా. నాయనా రామూ అది మిక్కిలి సుశీల...

రామం—అమ్మా! నీవు కడు అమాయకురాలవు. ఎల్లరూ నీనాశీ అమాయకహృదయు రాండ్రని యెంచుకుంటావు. స్త్రీహృదయమును కొలచగల మానవులుంటారా మాతా!

సీ. రాజరాజనరేంద్రు ♦ రచ్చపాల్పేసిన
చిత్రాంగిగాథను ♦ శ్రుతిని వినమె

భువి బృహస్పతికీర్తి ♦ బూదిపాల్చేసిన
తారగాథనుకూడ ♦ ధరణి వినమె
పాండవపత్నియౌ ♦ పాంచాలి కర్ణుని
మనమున కోరిన ♦ మాట వినమె
అలనాడు కైకేయి ♦ యారామచంద్రుని
వనికేగ చేసిన ♦ వాక్కు వినమె

తే. ఇంతకన్నను మించిన ♦ యింతు లవుడు
పరమపథమును విడనాడి ♦ తిరుగ లేదె
సీత వారలకన్న సు ♦ శీల యగునె
కాన స్త్రీలను నమ్మగా ♦ గలనె మాత!

శాంత—నీకు కలిగిన యనుమానపిశాచమే నిన్నిట్లు వేధించి నీర సింపచేయుచున్నది. కాని సీత మహాసాధ్వి. పాముజాడ పాముకే తెలియువలయును. దొంగజాడ దొంగకే తెలియువలయును. అట్లే స్త్రీస్వభావము స్త్రీకే తెలియువలయును. పురుషుల కెట్లు తెలుస్తుంది.

రాముం—దానివినయాన్ని జూచి నీవు విభ్రాంతి జెందిపోయావు? కాని "అతివినయం ధూర్తలక్షణమ్మనెడి" సూక్తిని నీవు గ్రహింప లేకపోయావు తల్లీ!

శాంత—నాయనా రామం! నూతిలో నిప్పువున్నదన్న యెవ్వరు నమ్ముదురు.

రాముం—గంధపుచెట్టు పాములను చేరదీసుకోను నన్న నమ్మవా!

శాంత—విశ్వప్రేమమయూరాలగు సీత పరిరియొకనిని సోదరునిగా ప్రేమింప కూడదా లేక పితృనిగానో పుత్రునిగానో ప్రేమింపకూడదా ప్రేమకు యెన్నిమార్గాలు లేవూ.

రాముం—తల్లీ! నీ వెన్ని చెప్పినా నాబుద్ధి కెక్కడము లేదు. మాటి మాటికీ అతుచ్ఛవాంఛాలంపటికై పేరెత్తి న న్నేల విసికిస్తావూ.

జననీ సీతను మరచిపోవాలి. నేను మరచిపోతాను. నాహృదయ మందిరములో దానికి తావు లేదు. నాస్వార్జితపుణ్యా న్యారాసులలో దానికి భాగము లేదు. బలవంతముగా వెడలగొట్టితివి. అబ్బా! అపాయకరమగు నామనమున కింత యశాంతి చేకూర్చి నదీ నాటుకొనిపోయి యున్న ప్రేమమహావృక్షమునా, పూతపూసి కాయలు కాసి పండి పండింపజేయవలసిన ప్రేమమహావృక్షమును బలవంతముగా నరికించుచున్ననూ మరల మరల చిలక లెత్తుచున్నదే.

శాంత—రామూ! నీవు నున్మాదావస్థలో నున్నావు. కన్నులార చూడకుండా. తగినంత నిదర్శనములు లేకుండా అట్టినిందారోపణ వగాయమ్మ గన్నబిడ్డపై వేయకూడదు. నావంటి తెలుగు మాతలు సహింపరాని, మాటలివి. సిద్ధాన్నమును త్రోసివే సేసుకోవాలు—

రామం—నావిషయం నాకు తెలియుచు మాతా.

శాంత—హాబాధ! ఈబాధ సహింపరాని బాధ. భరింపరాని బాధ.

రామం—అమ్మా! అమ్మా! అదేమి టమ్మా అట్లా అంటున్నావూ?

శాంత—అదిగో! అదిగో.

రామం—అమ్మా! అట్లా చూస్తున్నా వేమి టమ్మా.

శాంత—అదిగో పెద్దతుపాను.

రామం—ఏమి తుపానూ ఏమిమహాశోకం.

శాంత—పడవలో సముద్రప్రయాణము చేస్తున్న సీతచుట్టూతుపాను చెలరేగి భిన్నాభిన్నాలు చేసేస్తున్నది రా.

రామం—కలగంటున్నావా మాతా.

శాంత—కలగాదు. అతివిషమమగు సముద్రప్రవాహమ్మునడుమ పడవ వొరగిపోవుటచే పచ్చిబాలింతరాలు కొట్టుకొని పోవుచున్నది యెట్లా! నాయనా త్వరగా పోవమ్మా.

రామం—మాతా! మనసును చెడిపో చేసుకొంటున్నావు.

శాంత—దైవానుగ్రహమున్న తీరంబునకు చేర్చుకొనగలుగుదువుపొమ్మ.

రామం—(తన) రోగపీడితురాలైన మాతృదేవికి అనాలోచితుడనై నామనోవేదన విన్నవించుటకూడా వివతుల్యమై పోయినదే. గ్రహచారము చాలనప్పు డిట్టివివత్తుట్టములే ముట్టడించు చుండును.

శాంత—సీత! సీతా! అనుమానవనుహానసముద్రములో కష్టాల తెప్పనొ య్యపై ప్రయాణం చేస్తున్నావు. జారితే దుఃఖకెరటాలుకొట్టుక పోతవి జాగ్రత్త నేను పోతున్నా హా సీతా,

రామం—అమ్మా! అమ్మా.

శాంత—సీతా! సీతా! రామా! సీతా! హా బాధ. (ప్రాణాలు విడచును)

రామం—హామాతా! నన్ను వీడి పోతివా.

సీ. పుట్టినవాడి నన్ ♦ పువ్వులలో నుంచి
పోషించె నెవ్వరు ♦ పొలుపుమీర
అహరహమ్ము నన్ను ♦ అతిశ్రద్ధతో తన
కనురెప్ప లార్పక ♦ కాచె నెవరు
సంగీతశాస్త్రంబు ♦ చక్కగా చదివించి
సంతోష మొందిన ♦ సాధ్వి యెవరు
నీతివాక్యంబుల ♦ నిస్తులప్రేమతో
గఱపి తా నలరిన ♦ శాంత యెవరు

తే. కష్టపడి పెండ్లిచేసిన ♦ గరిత యెవరు
తండ్రి కేవట్టిలోటును ♦ తరిమె నెవరు
అట్టి జననియె అక్కటా ♦ యస్తమింప
నేమిసేయుదు చింతాగ్ని ♦ కేది సీమ.

(తెర వ్రాలును)

## తృతీయ రంగం.

(మాధవుడు చింతాక్రాంతచిత్తుడై మూల్గుచు కుర్చీలో కూర్చొని యుండ సీత పిల్లవానిని జోకొట్టుచుండ, మన్మధుడు మాధవుని కు సేవచేయుచుండ తెర లేచును)

సీత—బాబూ! ఏడవకు.

తే. కాదనాలైన చేయుని ♦ కూర్రియుల కివు
డేల పుట్టితివో యయ్యా ♦ యేడ్వ కయ్యా
మనకు మించు దురదృష్ట ♦ మనుజమా
లెందు లేరయ్య యల్లరి ♦ యేటి కయ్యా.

మన్మ—సీతా! రామం తనపుత్రరత్నాన్నైనా చూడకుండా యెట్లా వుండగలుగుతున్నాడో కదా.

సీత—సోదరా!

తే. పుట్టి పుట్టకమున్నె యీ ♦ పుత్రు డయ్యొ
కన్నతండ్రికి పగతు ♦ డై కల్గినాడు
అన్న పాసినమైన పీ ♦ డయ్యెకడకు
చేయజూచునె యదికూడ ♦ చేయరేమొ.

మన్మ—ఊరుకో సీతా! అాతయ్య పుట్టెడుబబ్బులో నున్నాడు.

సీత—మన్మధా! నేటి కర్ధసంవత్సరమై పోయింది. ఇంతవరకూ మనము వ్రాసిన వుత్తరాలకు ప్రత్యుత్తరాలు వచ్చుటకాని, అత్తయ్య గారి కెట్లున్నదో జాడా జబాబుకాని రాకున్నది.

మన్మ—తిరిగి మొన్ననే మరొక జాబునుకూడా వ్రాశాను.

మాధ—దానికిమాత్రము తిరుగుజబాబు వ్రాస్తేగా—

సీత—మన్మథా! నామెడ వారికింత టాగ్రహ మెందు కొచ్చిందో తుదకు కన్నకుమారుని కన్నుల జూచుకొనుటకైన రానంతటి యపచారము వారియెడల నే నేమి చేసియుండ లేదే! చివర కింత ఉత్తరవు ముక్కకైనా నోచుకొనక పోతినా — ఇక నాజన్మ మెందుకు మన్మథా!

మన్మ—సీతా! విచారింపకు చంద్రునికైనా క్షీణదశ వస్తు పోతుం టుంది. ఇక మానవులమగు మనకా—

సీత—నన్ను తీసుకొని పోవుటకు వారే రావలయునా, రమ్మన్నప్పుడే పోవలయునని యేశాస్త్రములో నున్నదీ.

చ. ఇదివర కెందరో యబల ♦ లిట్లులె భర్తలు వీడిపోవగా
వదలక వారివెంట జని ♦ వాసిని గాంచగ లేదె మన్మథా!
మొదట శకుంతలానతి ♦ ప్రమోదముతోడను భర్తవద్దకే
కదలి చనంగ లేదె తన ♦ కణ్వుని శిష్యులతోడ నేతయున్.

అట్టులే నేనుమాత్ర మేల పోకూడదూ.

మన్మ—సీతా! తాంత్యా స్వస్థత పడనిమ్ము అట్టులే పోవచ్చును.

సీత—నిజానిజములు గ్రహించుకోలేక యీగ్రామీయులు నన్ను మహాదుయ్యబట్టుతున్నారు. నేను యెట్లు నిబ్బరించుకో గలుగుదునూ.

తే. అమ్మలక్కలు నాచుట్టు ♦ గ్రమ్ముకొనుచు
యత్తగారింటి కేల పో ♦ వరుగ నైతి
వమ్మ యని నన్ను దుర్భావ ♦ లాడుచుండ
యెటుల సైరింతు దుఃఖాబ్ధి ♦ కేది యంతు.

వారు దుర్జనకోటిలోనివారైనచో వారినే యందురు. కానవ్వుడు నన్ను జూచి ప్రపంచం పూరుకుంటుందా.

మన్మ—సీతా! ఇది యనూహ్యాప్రపంచం గనుక యెందుకూరు కొంటుందీ...

పోష్టు—(ప్రవేశించి) సీతాయమ్మగారూ!

సీత—ఎవరు. (చూచి) పోష్టుజమానుగారా.

పో—ఔనమ్మా! మీకు ఉత్తర మున్నది. బేగ తీసికోండి. వెళ్ళాలి.

(అని యిచ్చి నిష్క్రమించును.)

మాధ—(ఆయానంతో) సీతా యెవరు వ్రాసిరో పెద్దగా చదువు తల్లీ వింటాను.

సీత—చదువుతున్నాను తాతయ్యా! (అనుచూ కవరును విప్పి) ఆహా! నాహృదయేశ్వరుని కడనుండి జాబు యెన్నినాళ్ళకు చూడగలిగి తిని. (కన్నుల కద్దుకొని) శ్రీ శ్రీ శ్రీ సీతామహాదేవిగారికి రామం వ్రాసుకొనుచున్న విన్నపమేమనగా...? చూ చావా మన్మథా యెంతనిష్ఠూరముగా వ్రాశారో!

మన్మ—ఆతడు హాస్యప్రియుడు గనుక హాస్యమున కట్లు వ్రాసియుండ వచ్చును. తరువాత.

సీత—నాజనని స్వర్గస్థురాలై సుమా రేడెనిమిది నెలలై పోయినది. హా! అస్తమించితివా అత్తయ్యా.

మాధ...కటకటా! హాళ్ళఘట్ట మనుకొనగా తుదకు విషాదఘట్టము గానే మారినదా—

మన్మ—కాయ పండి రాలిపోయినది. కనుక విచారపడ్డ ఫల ముం టుందా.

సీత—అటువంటి అత్తగారు యేడేడు పదనాల్గుజన్మాలకైనా లభ్యపడదు ఈపాపిష్ఠురాలకు అంత్యసేవలు చేసుకొను భాగ్యమైనా లేక పోయింది. అత్తయ్యా!

చ. ఇలపయి నెన్నొ నోములను ♦ యింపుతలిర్పగ నోముచేసి, స
త్ఫలసుమ ధర్మసార్మ్యవని ♦ పాదుగధర్మము లీయచేసి, నా

కలమును, గోత్రమున్ గృహము • కూడను ధన్యతనొందఁజేయఁగో
డలవయి కంచు యిబ్బి నను • డాసి నుతించెదు యత్తకుంకెనే.

మన్మ—ఆధ్యాత్మికతత్వపరిశీలనోత్తమురాలవగు నీవే యిట్లు విచారింప సామాన్యమానవులు విన్ననుసరింపరానీలా! విచారింపక ఆతరు వాయినికూడా పూర్తిచెయ్యి.

మాధ—ఇంకెన్ని పిడుగువార్తలు వెలువడనున్నవో కదా.

సీత—(మరల చదువుచు) నేనిప్పుడొక నున్మత్తుడనై పోయాను. నాకిప్పుడు మనశ్శాంతి లేదు. ఈమాయాప్రపంచాంధాకారగృహమున వెలుగు కానుపింపక యేమూల కొఱగుదునో యెచ్చటికి కొట్టుకొనిపోవుదునో నాకు అంతు తెలియదు. బందరులో చాలారోజులకిత్రమే నాఁజసని నివాసముంటూన్న గృహమును కూడా ఖాళీచేసి వెడలిపోతిని. సన్యసింప తలంచితిని. కాని ఆత్మ యింకనూ పరిశుభ్రతగాక యనుమాన పెనుభూత విష వికృతఘోరవక్త్రములో చిక్కి వ్రక్కలై పోతున్నది. నన్ను మఱచిపోయితి వనుకొందును. మరచిపోవలయునవియే నాకుతూహలముకూడా నీనవమన్మధుని మాత్రము మరువవలదని నా విన్నపము.

ఇట్లు,

పూర్వపు రేడియో గాయకుడు నేడు నీవు చేసిన పిచ్చిసన్యాసి.

రా మ ం

సీత—హా యెంతమోసము జరిగినది. హానాధా! (అని మూర్ఛిల్లెను)

మన్మ—(చెవులు మూసికొని) హరి! హరీ! ఆతడు పండితుఁడే కావచ్చును. కాని మానవనటన సూత్రాన్వేషణాధురీణుఁడు కాడను కొందును.

మాధ—మన్మధా! చిక్కి శిధిలస్థితిలోనున్న నాగుండియలలో రాముడు వేసిన తుపాకిగుండ్లు నాటుకొని పోయినవి. తీసినను రావు

వచ్చినమా గాయము మానదు. మానినమా ఖ్యాతిహీన జీవిత శేషాన్ని హాయిగా గడుపలేను హాబాధ హాగుండియలలో యిముడగుండ్లు, హాసీతా! అబ్బా అశాంతి అపవాదు అనుమానం. అనరాదు. వినరాదు. తీ పరాను. సీతను అనుమాన భూతాని కొప్పగించి పోతున్నా. కాపాడేవంతు నీయది. మన్మథా! బాధ—హా! (అని ప్రాణావశిష్టు డగును)

మన్మ—అస్తమించితివా భారతజాతి నవకల్పక భూరుహమా

తే. పతి కైనమా ఆశ్రయ ♦ విధము కలదు
సీత కెవరుండి రంచని ♦ శిథిలహృదయ
వీణతీగెల కదలింప ♦ పాణి మేగె
పోషణము లేని కవి కృతి ♦ పోయినట్లు

చ. కవి తనకావ్యకన్నియను ♦ కల్గినవానికి కాన్కయీయడు నీ
దివి ప్రజ కందజేయుకది ♦ దిబ్బగ పాలొనరింప వాడు నా
కలి మది యెంత కుందె తన ♦ కావ్యము కోసర మెంత యేడ్చునో
సువినయశీల సీతకయి ♦ క్రుక్కుచు గుట్టులె కూలిపోతినా.

(తెర వ్రాలును)

## చతుర్థ రంగం.

(పీడితహృదయుడైన రాముడు చెన్నపురి బజారులో)

రాము—(ప్రవేశించి)

చ. మతి స్థితి లేక నేను కొర ♦ మాలిన గాఢవిషాదగేయముల్
చితికిన గొంతులెత్తి వ్రజ ♦ ఛీ యనిపాడుచు నుంటిగాని భూ

పతనము కాగ నున్నవర ♦ భక్తశిఖామణి త్యాగరాజ స
త్కృతులను పాడనైతి కడు ♦ క్రూరుడ నే నొక గాయకుండనే.

మరియు,

ఉ. ముందును వెన్కలారయని ♦ మూర్ఖుడనౌచు మాఖారిరాగమే
వందలసార్లు పాడుచును ♦ భారతబానిసదేశమందు నే
నెందుకొ కాలయాపనము ♦ యెవరిజేరక చేయుచుంటి హా
క్రిందటినాడు కన్నడపు ♦ కీర్తన ఖేదనకీర్త నయ్యెనే.

అదియునుంగాక,

చ. అదనుగ పిల్కలెత్తు యను ♦ మానవిషాదకథావిధానమే
వదలక వ్రాయుచుంటి యిల ♦ వాల్మికివోలెను పుణ్యగాథలన్
పదిలముగాను వ్రాయుటకు ♦ ప్రస్తుతభాష యభావమౌచు హా
కుదరక క్రుంగుచుంటి కడు ♦ క్రూరుడ నేను కవీశ్వరుండనో.

కటకటా!

ఉ. సీతను వీడియున్ హృదయ ♦ సీమను చిత్రవిచిత్రమౌ నటుల్
నూతనశిల్పకుండనయి ♦ నున్నని మీగడ లీను రాలపై
సీతమనోహరాకృతిన్ ♦ చీటికిమాటికి పిచ్చివానికై
ఖ్యాతిగ చెక్కుచుంటి కను ♦ గానక నే నొక శిల్పకుండనే.

ఇప్పుడు నేనెక్కడ నున్నానూ తెలిసినది.

చ. ఇది మదరాసు యే నిపుడు ♦ యియ్యెడ కొందులకొచ్చి యుంటినో
మదికిని తోచదాయె కడు ♦ మాసిన బట్టలతోడ నున్న నన్
పదుగురుస్నేహితుల్ గనిన ♦ ప్రాణము యింటికి లేచిపోవదే
యెద నను మెత్తురే యిటుల ♦ యేగిన నాదగు సాటిబాంధవుల్.

కావున యిట్టిస్థితిలో యెచ్చటికీ పోరాదు. (తూలుతూ) అబ్బా ఆయాసం - అమ్మతోపాటు ఆనంద ఐశ్వర్యాలే గాకుండా అన్నపానాదులుకూడా అతిదూరమై పోయినవి. హా కన్నులు

మూతబడిపోవుచున్నవి. కొంచెము సేపు ఈయింటియరుగుపై విశ్రమిస్తా - హా సర్వేశ్వరా (అని సొరిగిపడిపోవును. దయార్ద్ర హృదయురాలగు రాజ్యం పిశాయన తెల్పుతూ రామాన్ని చూచి)

రాజ్యం—మొదట యెవరో భిక్షుకు డనుకొంటిని! మారామమా! అయ్యో నారామా! నాప్రేమంపురామా నీ స్థితి తుదకు యీరీతిగా పరిణమించినేమి గానతొంబురా—

ఉ. ఓమహనీయకోమలన ♦ వోదయభారతఖండభాస్కరా
శ్యామలగాత్రచారుతర ♦ శ్రావ్యసుగానకళావిశారదా
రామమ! నేడు నీనుదటి ♦ వ్రాతఫలంబిటులయ్యె నయ్యె న
త్ప్రేమముతోడ నిత్యమును ♦ వేడెడి కన్యతో పల్కరా ప్రభూ!

ఆలసింపరాదు. అదిగో యెవ్వరో వచ్చుచున్నారు వారిసహాయమున వీనిని గొనిపోయి వెంటనే చికిత్సను చేయింపవలయును. లేకున్న ప్రమాదము. (సేవించు సేవలు చేస్తూండ )

(తెర వ్రాలును.)

## పంచమ రంగం.

(గిరిరావు ఖాతా వ్రాసుకొనుచుండ మన్మధుని ప్రవేశము.)

మన్మ—గిరిరావుగారూ!

గిరి—ఎవరు వారు?

మన్మ—నేను మన్మధరావును.

గిరి—ఎందుల కొచ్చావూ.

మన్మ—సీత పెనిమిటికి మీరు ప్రియమిత్రులని తెలిసికొని మనవి చేసికొనుటకు వచ్చితిని.

గిరి—చాలు - చాలు! మీచరిత్రింతా నాకు యిదివరకే తెలుసును. శ్రమపడి టూరిప్పుడు మనవి చేయనక్కర లేదు.

మన్మ—యధార్థాన్ని మనవి చేసుకుంటాను.

గిరి—యధార్థమో! నీశాద్ధమో లేక నాశ్రాద్ధమో ఇప్పుడదంతా యెవరికి కావాలి.

మన్మ—వింటే మీకే తెలుస్తుంది.

గిరి—విన్నాను. వింటున్నాను. ఇక విని మాత్రము చేసే దేమున్నది.

మన్మ—కాపురమును కుదుటపర్చగలరని, సీతయందు యేకొంచమేని యే లోపము లేదనియు దైవసాక్షిగా మీకు మనవి చేసుకొంటున్నాను.

గిరి—నీవంటే చాలా! లోకమంతా కోడై కూస్తున్నా నమ్మకపోవుట యెట్లూ? సీతకాపురము యెగిరిపోవుటకు మూలకారకుడవు నీవే! నీవు చేసినపుణ్యామే అదంతా! దానికిమాత్రం బుద్ధివుండ నక్కర్లేదూ! గుట్టూవాట్టయినా అక్కర్లేకుండా నీతో నరవ సల్లాపాలాడుతూ పైగా పక్కనాపడుతూంటే వ్రపంచ మే మనుకుంటుందోనన్న సిగ్గయినావున్నదా దానికికానీ నీకుకానీ.

మన్మథు—గిరిరావుగారూ యధార్థాన్నివూహింపనైనా వూహింవ కుండ తదితరులేగాక తెలిసినవారు తమరు కూడా మమ్మిరువు రిసీ బజారుపాలు చేయడం మహాపాపం సుమా! మీరుకాబట్టి సహింపగలిగితిని. ఇట్టిమాటలు మరియొకడాడినచో తత్క్షణమే వాడివక్షస్థలాన్ని పగలకొట్టి పోయేవాడిని.

గిరి—పాపిష్టుడా పైగా నాయింటి కొచ్చి ప్రగల్భాలాడుతున్నావా. వండ్లూడగొట్టి పంపిస్తా ముందు నాగడపదిగు.

మన్మ—చాలా గొప్పవనే చేయిస్తారు.

చ. సరిసరి నోరుమూయుము మిక ♦ చాలును సీతకు నాకు మన్మథా
విరివిగ బంకుగట్టినదు ♦ వీధికి పాలొనరింప యిమ్మెయిన్
మెలుగుచు నుంటివా తెలుగు ♦ ముల్కవరాలగుణాలుగల్గు నా
వరమ సుశీల నాయువర ♦ భారతి నాకొక చెల్లెలౌ సుమా!

గిరి—ఛండాలుడా! నామిత్రుని జీవితాన్ని ధ్వంసం చేయడమే కాకుండా యథార్థాన్ని వెలిబుచ్చుతున్నావన్న యీర్ష్యతో లతోధికారుడగు యీగిరిరావునే నోరుమూయుమనుచుంటివిగా (రూళ్ళకఱ్ఱతో కొట్టుతూ) చావు చచ్చువెధవా చావు. (అని నెట్టివేయును.)

మన్మ—నిజముగా సీత పతివ్రతేగనకైతే నన్ను కొట్టినచేతికి కుష్టు పుట్టియే తీరును. (శపించి నిష్క్రమించును.)

తెర వ్రాలును.





ఓం

శ్రీవీరాంజనేయాయనమః.

# యథార్థము

## (లేక పతివ్రత)

---

### తృతీయాంకము — ప్రథమరంగము.

(సీత యేకాంతంగా)

సీత—నాకష్టచయమూల నెవ్వఁడు తుదముట్ట జేతువోకదా. భగవంతుఁడా!

తే. శోకవార్నిధిలో చిన్న ♦ నౌకపైన
జీవయాత్రను సల్పెడి ♦ జీవి కిపుడు
ప్రళయఝంఝూప్రభంజనో ♦ త్పాతభరము
తోడుపడుచుండె నొడ్డుకు ♦ త్రోయుమయ్యా!

తా నొకటి తలప విధి మరియొకటి తలచినట్లు!

తే. కాలభూతంబు నన్మ్రింగ ♦ గల్గునంచు
గంపెడాశతో నుండయా ♦ గండ్రముండ
కాతగారిని మ్రింగి తా ♦ తరలిపోయె
నెటుల జీవింతు యీపుత్రి ♦ నేమిసేతు.

నివ్వకూడా పుట్టనివ్వకుండా చెప్పుచూ నాటి అమ్మలక్కలు నన్ను రచ్చపాలు జేసి మొవ్వు తిప్పలు పెట్టుచున్నారు. కానిమ్ము అన్నిటికీ భగవంతుడే సాక్షీభూతుడై వున్నాడు. సహజంగా.

తే. మగడు విడచిన స్త్రీల కి ♦ మ్మహినిచూడ
వరువుమర్యాద లసునవి ♦ బాసిపోవు
నెంతి శీలముతో నున్న ♦ నేమి దాని
లోకు లందరు కాకులై ♦ పీకుచుందు రి.

తాతగారు పోష్టుమాష్టరుపని చేసి పింఛను పొందుతూ మమ్ములను పోషించేవారు. ఇప్పు డెవరు పోషిస్తారూ.

మన్మ—సీతా! సీతా! (నెత్తురుగుడ్డలతో ప్రవేశిస్తాడు)

సీత—(చూచి) సోదరా! ఈగాయ మగుటకు కారణం.

మన్మ—ఈగ్రామీయుల సగౌరవముతో చూచుచున్నందులకు వారు నాకు చూపిన అగౌరవమే యీగాయమునకు కారణం.

సీత—సోదరా! ప్రాణిసేవయే పరమాత్ముని సేవయని తలంచి నాచరించు నిన్నే కొట్టినారుగా. కారణ మేమో నాకు చెప్ప కూడదూ.

మన్మ—చెప్పకూడదూ! చెప్పజాలను.

సీత—చెప్పుము. విని నేను సగభాగాన్ని పంచుకుంటాను.

మన్మ—సీతా! ఇంతకాలము నీ చెంత నుంటినికాని యది రానురాను వొకవిషఘుట్టిగా యేర్పడినది. ప్రాయశ్చిత్తము చేసుకొనపోవల యును గనుక శలవు.

సీత—వివరింపకే పోయెద నందువేమి సోదరా!

మన్మ—మన సోదరసోదరీమణుల పవిత్రప్రేమ యీపాశ్చిక ప్రపంచ మునకు గిట్టనిదై పోయినది. సోదరీ!

ఉ. సాయము సేయుచుంటి నను ♦ సాకుమ యోర్వగలేక దుర్జనుల్
కూయగ రాని కూతలను ♦ కూయుచు వెగాకను నీకు నాకునున్
మాయని అంటుగట్టి యవ ♦ మానము గూర్పగ చూచుచుండ నే
న్యాయము కాదు మీ కనగ ♦ నన్నిటు కొట్టిరి చూడు సోదరీ!

సీత—సోదరా! అగ్నికి చెదలంటునా గనుక విచారింపకు పైన గంపంత కన్నుపెట్టుకొని భగవానుఁ డన్నీ చూస్తూనే వున్నాడు.

మన్మ—సోదరీ! నీవేమైనా చెప్పుము. ఇచ్చటుండుటకు నామన మంగీకరింపకున్నది. కాన పోవనిమ్ము. పిచ్చివానినై పోవనిమ్ము. పీనుగనై పోవనిమ్ము.

సీత—సోదరా! నీవుకూడా నన్ను విడిపోయినచో నాగతి యేరీతి తెల్లవారుతుంది

మన్మ—నాకు మతి పోయినది. ఇక నన్నుకూడా పోనిమ్ము. సీతా! మనసోదరసోదరీమణుల ప్రేమ ప్రజలకేగాక విధికికూడా కన్ను గుట్టి పోయినది. కలవు (బుల్లిబాబును కన్నీటితో చూచి) కలవు బుల్లిబాబూ! నావల్ల నీవుకూడా దుష్టగ్రహావక్రములోపడి నలిగిపోతావేమో ననుభయముచే నిన్ను విడిపోతున్నాను. ఇకనైనా సుఖపడుదురేమో నని పోతున్నా! ఏదో మాయ భూతం నన్నిచ్చటకో లాక్కొనిపోతున్నది. అది పొమ్మన్న చోటకల్లా పోతాను. విసికి వేసారి పోతున్నాను. మిమ్ము కష్టాల కాలభూతపాళ్ళో పెట్టి పోతున్నాను. అంతులేని అఘాతము లోనికి జారిపడి పోతున్నాను. పోతున్నా తాతగారి అంత్యసందేశాన్ని కూడా త్రోసిపారేసుకొని పోతున్నా! (అహ్హాహ్హాహ్హో అని వెకిలి నవ్వుతో) పోతున్నా పోతున్నా (అని నిష్క్రమించును. సీత విభ్రాంతితో)

సీత—హా సోదరా నావల్ల తుదకు నున్మత్తుడవై పోతున్నావా. నా కీప్రాణ దిక్కెవరూ. పరమేశ్వరా తుదకు నన్నేకాకినిగా చేసితివా దయామయా! (పడిపోవును?)

తెర వాలును.

ద్వితీయ రంగం.

(రామం చింత బాయుటకు లందుల కై రాజ్యం పాడుచుండును).

రాజ్యం—రామం!

ఉ. నీమది కింపుగా క్రితము ♦ నీవె రచించిన ప్రేమగీతికల్
రామము! వీణతో గలపి ♦ రాగము తాళము తప్పకుండ నే
ధీమముతోడ పాడెదను ♦ తీయనివేళను తప్పు లున్నచో
శ్యామలగాత్రి చెప్పుచును ♦ చక్కగ గ్రోలుము గానమాధురిన్.

రామం—పాడుము.

రాజ్యం—(పాట వీణపై పాడుతూ పాడుతూ ఆపి) రామం!

రామం—ఎందుకు రాజ్యం!

రాజ్యం—ఇప్పుడు నీ కెట్లున్నదీ.

రామం—నీగానసుధామృతపానమువల్ల యించుక హాయిగానే వున్నది.

రాజ్యం—ఇంకనూ హాయి చేకూరగలదు. రామం!

ఉ. వూయగ నిమ్ము వున్న మృదు ♦ పువ్వుల శయ్యను వవ్వళింపవల
రాయగ నిమ్ము చందనము ♦ రామము! యింక యనేక తైలముల్
హాయిగ నంటనిమ్ము సుమ ♦ హారము వేయగనిమ్ము రమ్ము బల్
సోయగమైన దుస్తులను ♦ సొంపుగ తాల్చియు సౌఖ్య మొందిక.

రామం—నాకేమీయూ వలదు. నీగానసుధామృతమే చాలును.

రాజ్యం—రామం! మొదట యీ చిన్నపురిలో నీకెవ్వరూ స్నేహితులు లేనప్పుడు నేనుకాదూ?... నీవంటే.

రామం—ఇప్పు డదెందుకు రాజ్యం.

రాజ్యం—కాదు ఊరికనే—మరి మనం స్త్రీపురుషభేదం లేకుండా ఎంతో కలసి మెలసి హాయిగా వున్నాం.

రామం—ఔను. నేను కాదన్నానా.

రాజ్యం—నీవు నొచ్చుకోవకు రామం! కొంతకాలం కితం ఇలాగంటి సమయమే. ఈవసంతఋతువులోనే. ఈడాబాపైనే—ఆనాటి సాయంసమయాన నీవు ప్రయాణమై పోతున్నావు. అప్పుడు నేనూ—?

రామం—దానికి నే నేమన్నానూ. అసలు యిప్పు డాగొడ వెందుకూ.

రాజ్యం—రామం! నీవు కుఱ్ఱవాడవుకావూ. ముసలివాడవూ కావు. మంచి తెలివి గలవాడవు కదా. పరేంగిత మెరుగ లేకుండటం.

రామం—ఎరుగక పోవచ్చును. దానిని కివ్వ డేమి మునిచుకపోయిందీ.

రాజ్యం—పోనిమ్ము మన మొకమారు తారాశశాంకం చదివాము. గుర్తున్నదా.

రామం—గుర్తు లేకేమీ ఒకమారు కాదు. లక్షసార్లు చదివాము.

రాజ్యం—చంద్రుడు మూర్ఖుడైనప్పుడు తార యేమి చేసిందీ.

రామం—ఆతనిని బలవంతముగా తనకు లోపర్చుకున్నది. అదే ఆమె చేసిన ఘనకార్యం.

రాజ్యం—ఎందుకూ...? ఆమె గురుపత్ని. ఆతనిని పెంచింది. పెద్ద వాడిని చేసింది. చివర కాతడామెను అర్థం చేసుకో లేకపోయి నాడు. అప్పుడు తనే చెప్పింది. చివర కాతడామెను వు.ప...

రామం—రాజ్యం! నాకు నీప్రశ్నలవుద్దేశ్యం తెలుసును కాని తారా వ్యాజంగా నీవుద్దేశ్యమును వెలువరించుచున్నావు. అందుకు న వ్వొస్తున్నది. ఏమంటే తార చంద్రుణ్ణి తనస్వార్థమునకు నీతినియమాదుల నుల్లంఘించి బలి చేసిందంటే ప్రపంచ ములో మానవజీవితో ద్రేకాలు ఉన్నందు నీతిజాతియుక్తా యుక్తములు నశించునుగనుక జాగ్రత్తగా యుండుటనే యాద ర్శమునకు కాకూడదూ...?

రాజ్యం—రామం! నీవు చెప్పే ఆదర్శం కాదనవచ్చును. కాని యిప్పు డాచర్చ యెందులకూ...! ఒకవిత్తనమును ఎత్తి సీరు కట్టగా ఋతువు దానిని ఫలవంతం చేసింది. ఫలపుష్పపత్రభరితమైన ఆచెట్టును మనము వుపయోగించుకో లేక దాని కేవేవోమాట లల్లి ప్రవరాఖ్యునివలెగా చెప్పుటలో యర్థమే మున్నదీ నా వుద్దేశ్యముల ప్రకోపం నీ వుపేక్షలో లె వృద్ధిపొందుతూన్నది. నీవు యీసృష్టిలో నా కోరకే యేర్పడ్డా వనిపించింది. ఆత్మ సన్నిహిత పొందిన మన యీరెండుజీవులూ చెట్టునుఆశ్రయించే లతలాగు, మేఘాశ్రియములో వుండే జలములాగు మానవ ప్రకృతిలోని ద్వంద్వగుణాం జేకోన్ముఖ ముయ్యేలాగు శాంతి ఆనందాదు లనుభవించ గలుగుతవనే వుద్దేశ్యం కలిగింది. నేను మాత్రం ఉద్రేకపడ్డానా—ఉద్రేక మింతకాల ముండుటకు అవకాశ మున్నదా.

రామం—రాజ్యం! నీ యీవాంఛ కేవలము నీస్వార్థానుభవముకొఱకు చూడూ నీయీప్రేమ నీవనుకొనే బాహ్యాకృతులకు కాకుండా మానసికముగా చూడు. కొంతకాల మట్లు సాధనచేసిన నీకర్థ మగును.

రాజ్యం—రామం!

చ. సరిసరి చప్పమాట లిక ♦ చాలును చానలు విన్న నవ్వరే
పురుషుడవౌచు నీ విటు న ♦ పుంసునిరీతిగ బల్క జెల్లునే
పరులకు నందరాని ప్రీతి ♦ భార్యయుతపుష్పము చిక్క చేతిలో
హర!హర! వాడబెట్టుకొను ♦ యాంధ్రుడుయంధుడు కాడెరామమా.

రామం—రాజ్యం!

చ. పురుషులు పోవగా తగిన ♦ పుణ్యతమంబగు త్రోవ లిట్టివా
నరియగు ధర్మమార్గమును ♦ చాటుచు దేశస్వతంత్ర్యసిద్ధికై
పరమపవిత్ర రక్తమును ♦ భక్తిగ నర్పణ జేయు నెవ్వడో
ధర యతడౌను పూరుషుడు ♦ తక్కినవారలు పుర్షు లౌనటే.

రాజ్యం—రామం! నీప్రేమకు స్థానము యిదివరకే నిర్ణయమైనదా?
లేక—

ఉ. చక్కనిదానగాననియొ ♦ కాణతనంబును నేర్వలేననో
టక్కరిమాట లల్లెనీ మి ♦ తారినికాననియో చలాకిగా
లెక్కచు తారుచున్ సినిమ ♦ తారలలాగుగ కుల్కలేననో
లెక్కలొ చేర్చకుంటి వప ♦ లేశముకూడను రామచంద్రమా!

రామం—రాజ్యం!

ఉ. చక్కనిదానవౌదువు ప్రి ♦ శాంతగుణంబులు నీకు గల్గుమి
న్నెక్కలి తెల్వియున్ తెనుగు ♦ మీరినవిద్య లికెన్నొయుండె నా
లెక్కలొ యుర్విపై గలుగు ♦ లేమలకన్నను మిన్నవౌదు వో
చక్కనిచుక్క యేమనగ ♦ చాలుదు తక్కువ లేన లే దికన్.

బాహ్యేంద్రియాలకు అపక్వవరూథినివే యవి చెప్పవచ్చును.

రాజ్యం—ఐతేచో అయిష్టతకు కారణం నేను గుణవతిని కాననియా.

రామం—గుణవతివే కాని నీయది వరూథినీమతం నాయది ప్రవరాఖ్యునిమతం.

రాజ్యం—రామం! బాహ్యేంద్రియాలూ అంతరేంద్రియాలని షష్ఠ-
వేదాంతోపన్యాసమంతా నాకేల బోధిస్తావు.

ఉ. హా నవమోహనాంగ యిక ♦ నైనను నీయధరామృతాననం
బానగనిమ్ము వేదనకు ♦ పాలొనరింపక ప్రాణదాతవై
లీనము చేసికొమ్ము నవ ♦ లీలల తేల్పుము కంతుకేళికిన్
బూనగలెమ్ము సత్వరము ♦ పుణ్యము నీకగు తాళలే నికన్.

రామం—రాజ్యం! మోహజ్వాలకు ఆహుతి వేసినకొలందియూ హెచ్చు రగుల్కొనుచూనే యుండును.

రాజ్యం—రామం!

చ. అడుగిడి యవ్వనాంబుధిని ♦ యక్కట యేదరి దోవ లేక నీ
మడుగులు నమ్మికొల్చుకొన ♦ మార్గము జూపుదువంచు నిన్ను నే
డడుగుచునుండ నీ విపుడు ♦ ఆలన పాలన చేయకుండుటల్
వెడగుతనంబుగాదె కడు ♦ వేగమె కౌగిలి యీయరా సఖా.

(అని కౌగిలించుకొనును)

రామం—రాజ్యం! ఇప్పుడు నీయీకృత్యము నీ కానందమును కలిగించిందా.

రాజ్యం—రామం! ఇదొక రకమైన యానందం. ఇదికాదు యింతకంటే యింకేదియో నామనస్సు వాంఛించుచున్నది. దానికే ఆరాటపడుతున్నది. ఆ ఆరాటమే నిన్ను స్పృశింపమన్నది కాని దీన తృప్తి లేకున్నది. యీశరీరమున కింకొక రకమైన తృప్తి.

రామం—రాజ్యం! ఇప్పటికైనా నీ కర్థమైనదా భౌతికస్పర్శాసమ్మేళన మొకరకమైన నరములశాంతికని నాయుద్దేశం. ఆశాంతి యెప్పటి కప్పుడే వుద్రేకపడుచుండును. దానికి కావలసినది నీ యీచర్యలలాంటివే. మాటిమాటికీ దానిని మనము కోరుట తాత్కాలికశాంతికే. తుద కది కల్పించునది అశాంతి.

హా రాజ్యం! మరల నామనస్సు యెచ్చటికో పోతున్నది. దిగులు. హా గుండెదిగులు. హా బాధ. (అని తలపట్టుకొని కుర్చీలో వ్రాలును. రాజ్యం సేవచేస్తూ మరల మరల వీణపై పాడుతుండ)

(తెర వ్రాలును.)

## తృతీయ రంగం.

(మతిభ్రష్టుడైన మన్మధరావు బొగ్గు తీసుకొని సీత పతివ్రత యని గోడలనిండా, బజార్లనిండా, తలుపులన్నిండా రాసుకొంటూ ప్రవేసించి)

మన్మ—ఓపక్షిసంతతులారా! సీత పతివ్రతేనా! ఓమృగసంతతులారా! మీరైనా చెప్పగల్గుతారా మీముఖం మీరేమి చెప్పగల్గుతారు మానవులే సీత పతివ్రతయని చెప్పజాలక చప్పరించుచుండ వావివరుసలు లేక సంచరించెడి మీరా యిక సీత ప్రతివ్రతయని చెప్పునది. మి మ్మడగటమే నాది బుద్ధితక్కువ.

పోష్టుజమాను ప్రవేసించి—మన్మధరావులా గున్నది. పాపం పిచ్చివాడై పోయి బొగ్గుతో గోడలనిండా, తలుపులనిండా కనపడ్డదానిమీదనల్లా సీత పతివ్రత సీత పతివ్రత యని వ్రాసుకుంటూ యీదెసకే వస్తున్నాడు. పాపం వీనికి దిక్కూ మొక్కూ కూడా లేదు.

మన్మ—ఓగ్రామీయులారా! మాసీత పతివ్రతౌనా కాదా! యధార్థాన్ని వెలిబుచ్చండి! ఛీ దుష్టాత్ములారా! నవ్వుచుంటిరా.

ఉ. సీత సుశీల కాదనుచు ♦ చిత్తములందు తలంచునట్టి వో
పాతకులార నానుడుల ♦ బాగుగ మీ రివు డాలకింపుడీ
మీతల కాయలందు మిను ♦ మిక్కిలి నోళ్ళలో పుండ్లు పుట్టగా
జూతును నేనుకూడ మిము ♦ జూచి వికావిక నవ్వే దప్పుడున్.

అహ్హాహ్హాహ్హాహా (అని పిచ్చినవ్వు నవ్వి) సీత పతివ్రత మహా పతివ్రత నే నీబాగ్గుతో నావాంటినిండా, పూరినిండా, హృదయంనిండా, అలవియైనచో బ్రహ్మాండభాండమునిండా వాల్మీకిలాగు పెద్దరామాయణాన్ని రాసుకుంటాను. మీకెందుకూ యిష్టమైతే పారాయణము చేయండి లేకపోతే మానండి. మీరూ నావంటి తెలివిగలవారైతే నారామాయణాన్ని పూజిస్తారు, శోకిస్తారు, శోధిస్తారు, స్తోత్రిస్తారు కానప్పుడు కడగా నుండటమే.

(పోష్టుజమాను యెదురుగుండా వ్రేసించి) మన్మథరావుగారూ! ఎంత అన్యాయకాలము దాపరించిందండీ మిమ్ము చూస్తే నా కెంతో యేడుపొస్తున్నది.

మన్మ—ఎవడవురా నీవు.

పో—నేను పోష్టుజమానునండీ.

మన్మ—(చెవులు కటిక్కిన పట్టుకొని) సీత పతివ్రతకాదని మొదట లేఖ తెచ్చినది నీ వేకదూ.

పో—నాకు తెలియదు బాబూ నన్ను వొదలిపెట్టుము.

మన్మ—ఫరవాలేదు యథార్థమును చెప్పుము యేచేతితో ఆ లేఖను తెచ్చావో ఆచేతిని నరికివేస్తే ఆపాపం పరిహారమై పోతుంది

పో—అంతపని చెయ్యవద్దు. మీకు సలాం చేస్తాబాబూ నన్ను వొదలి పెట్టండి.

మన్మ—అడిగినదానికి సమాధానము చిత్తగింపనిచో నాలుక కోసి కాకుల కేస్తాను.

పో—బాబూ నిజంగానే తెచ్చిచ్చాను.

మన్మ—(పీక పట్టుకొని) ఛఃపైనవాడివే కాని సీత పతివ్రతా కాదా.

పో—పీక గట్టిగా పట్టుకుంటే నేనెట్లు చిత్తగించుకొనేది.

మన్మ—సరే నల్పుగానే పట్టుకున్నా ఇప్పుడైనా చెప్పూ.

పో—(వణకుతూ) పతివ్రతే.

మన్మ—(పిచ్చినవ్వు నవ్వి) పెద్దగా చెప్పు.

పో—(పెద్దగా) సీత మహాపతివ్రత.

మన్మ—ఇంకా చెప్పూ. ఇంకా చెప్పు విసుకూ విరామమూ లేకుండా చెప్పవోయ్ వింటాను.

పో—సీత పతివ్రత, సీత పతివ్రత, సీత పతివ్రత.

మన్మ—నాకు హాయిగా వున్నది మరల మరల చెప్పు.

పో—సీత పతివ్రత, సీత పతివ్రత.

మన్మ—ఆపితే నీప్రాణంకూడా ఆగిపోతుంది. నా ప్రాణానికి చాలా హాయిగా వుంటున్న దంటుంటే అంటూండవేమీ...?

పో—అంటే ఆయాసం వొస్తున్నది. అనకుండా వుంటే పీక పిసికేస్తావేమో లేనిపోని గుదికొయ్య మెడకు తగిలిచ్చుకున్నా నేమిటీ.

మన్మ—పిసుకుతున్నా! పిసుకుతున్నా.

పో—అంటున్నా బాబూ! అంటున్నా.

మన్మ—అనూ అనేకసార్లు, అనవరతం అనూ! ఆనందంగా అను.

పో—(అంటూ అంటూ పారిపోవును. గిరిరావుగారు ప్రవేశించును.)

మన్మ—నీ వెవడవురా! ఓహో గిరిగాడివా!

గిరి—నీకింకనూ తలపొగ రణగలేదా పాపిష్టుడా. గనుకనే యనుభవించుచుంటివి. కాపురాలను కూల్చివేసే కంటకుష్టుకునకు మరిపిచ్చి పుట్టదూ.

మన్మ—(పిచ్చినవ్వు నవ్వి) నిజమేనోయి గిరీ! నాకు పిచ్చిమాత్రమే పుట్టింది. నీకు కుష్టుమాత్రం పుట్టకుండునా — ఒకవేళ నాకు పిచ్చి కుదిరితే కుదరవచ్చునేమో కాని నన్ను గొట్టిన చేతికి వచ్చు కుష్టుమాత్రము మానదు మానదు. దైవసాక్షిగా మానదు. సీత నాకు నిజమైన సోదరీమణియైతే నీకు కుష్టు కుదరదు. పొమ్ము సర్వనాశనమై పొమ్ము. నీవుకూడా దిక్కు మొక్కు లేని బిక్కావకీరువై పొమ్ము.

గిరి—పోరా పిచ్చినన్యాసీ నీపిల్లిశాపనార్ధాలకు కుండేళ్ళు బెదురుతాయా. (అని పోవును.)

మన్మ—పిచ్చినవ్వు నవ్వి పడిపోవును.

(తెర వ్రాలును.)

## చతుర్ధ రంగం.

(చాలా కాలము జరిగిపోయిన తరువాత చింపిరిగుడ్డలతో చింపిరి నెత్తితో సీత చెన్నపురివీధులలో వ్రేసించి)

సీత—ఓతల్లులారా! ఓతండ్రులారా! దిక్కులేని పక్షులము బాబులారా ధర్మదాతలు! ధర్మ మియ్యండి తండ్రులారా!

సీ. పతిపదసేవయే ♦ పరమోత్తమంబని
ప్రకటించి తరియించు ♦ పడతులార
అన్నసత్రాదుల ♦ నాచంద్రస్థాయిగా
కట్టించి బ్రతికించు ♦ గణ్యులార
గ్రంథాలయాలను ♦ ఘనముగా నిర్మించి
భాషపోషణసేయు ♦ ప్రాజ్ఞులార
పేదవారికి తిండి ♦ పెట్టిపోషించుచు
పేరుగాంచిన యట్టి ♦ పెద్దలార
తే. పుట్టుకుంకల దరిజేర్చు ♦ పూజ్యులార
వ్యక్తిస్వాతంత్ర్యమును గోరు ♦ వక్తలార
దిక్కులేనట్టి దానిని ♦ధీరులార
ధర్మ మిడరయ్య వోదయా ♦ ధర్ములార!

బాబు—అమ్మా! మనం చెన్నపట్నం వచ్చాముగా.
సీత—ఔను బాబు వొచ్చాము.
బాబు—ఐతే నాన్నను చూపిస్తా నంటివే...
సీత—బాబూ నీకంతటి యదృష్ట రేఖ కలదా.
బాబు—అమ్మా! నాకు ఆకలి వేస్తున్నది. అవి కొని పెట్టవూ.
సీత—బాబూ! చిల్లిగవ్వకూడా లేదు. నీ కవి యెట్లా వొస్తవీ.
బాబు—పోనీలే అమ్మా ఏడవకు అన్నిటికీ నే నున్నాగా.
రాజ్యం—(పికారుకోస్తు) ఎవరమ్మా నీవు...?
సీత—పొద్దు తెలియని కొత్తభిక్షుకురాలను తల్లీ!
రాజ్యం—నీ దేయూరు—?
సీత—అడుక్కతినే అభాగ్యురాలను ఒకవూరన నేమీ ఒకపల్లెయన నేమి. అన్నివూళ్ళూ మావే—
రాజ్యం—నీకులమూ—?

సీత—అడగటమెందుకూ అమక్కతినే కులమే.

రాజ్యం—ఈచిరుతడు నీగర్భాంకురమేనా ...?

సీత—ఔను తల్లీ! ఈపాపకర్మురాలి గర్భాంకురమే.

రాజ్యం—నీకు తాళిగట్టిన ధవుడు కానీ నన్నిహితబాంధవులు కానీ లేరా ...?

సీత—నాకు భర్త కలడు. పైన భగవానుడు కలడు. మరెవ్వరూ లేరు.

రాజ్యం—ఆయనకు మానవహృదయం లేదా—నీవంటి పవిత్రభారత రమణీమణినా భిక్షాటనమునకు బంపుట. ఇటువంటి సౌందర్య సౌభాగ్యసుకుమారునా కటికిపడగాడ్పుల కెరజేయుట.

సీత—అమ్మా! వారు మానవశ్రేష్ఠులు, మిగుల దయార్ద్రహృదయులు కూడాను, మానుదుష్కర్మఫలమునకు వారేమి చేయగలరు ...?

రాజ్యం—మిమ్ము జూచిన నాహృదయమేమో ద్రవీభూతమై పోవుచున్నది. మీవృత్తాంతమేమో సవిస్తరముగా వక్కాణింపుము. సోదరీ! చేతనైన సాయమును చేయగలుగుదును.

సీత—నాగాధ చాల పెద్దయగాధ. ఇంతకన్న నేనేమి నుడువగలను తల్లీ!

రాజ్యం—కడకు నీనామధేయమైననూ నుడువగలవా ...?

సీత—క్షమింపుము. నానామము దుఃఖపూరితమైన యక్కరాలతో పెట్టబడి యున్నది. కనుక మీరు వినరాదు. వినిదుఃఖింపరాదు.

రాజ్యం—సోదరీ! నీమాటలయందర్థము నాకేమాత్రమున్నూ గోచరింపకున్నది. పోనిమ్ము. యీయుపరబాలభానుని పేరైనా చెప్పుమమ్మ. విని తరిస్తాను.

సీత—బాబూ! లేక మాధవా యని పిలచుకొందుము.

రాజ్యం—బ్రహ్మవర్చస్సు నీఫాలభాగమున నెంత ఆనందకరముగా తాండవిస్తున్నదోయి బాబూ నీవు వరాలబాబువే. నీకు తాయం పెడతాను కాని మీనాన్నగారిపేరు చెప్పుతావా?

సీత—మాఅమ్మ చెప్పమంటే చెప్పతా! లేకపోతే చెప్పనే చెప్పను.

రాజ్యం—బిడ్డా! నీవింత పిన్నతనముననే మాతృయాజ్ఞను మేరమీర కుంటివి. పెద్దవాడవైనచో నీవిజ్ఞానచంద్రికలు నెన్నిదేశము లలో ప్రకాసించి పోవునోకదా. నిన్ను గన్న యీనీతల్లి కడు ధన్యురాలు. నిన్ను గన్నతండ్రి ధన్యులలో వరమధన్యుడు. అదిగో ఆకనువడునదె మదీయదివ్యభవనము. మరల నొక్క యామములోనే నాభవనమునకు నేను చేరుకొనగలను. కాన నీ వక్కడికి వచ్చినచో నీకు కోరిన దుస్తులన్నీ కుట్టించియిప్పిస్తా. కలిగినదానిలో కొంతబీదలకు పంచిపెట్టుట నాకు నిత్యం అలవా టుకాన మీయమ్మను సైతమూ తీసుకొని రాబాబూ! దయార్ద్ర హృదయుడగు మారామముకూడా మిమ్ము చూచి కనిక రిస్తాడు.

బాబు—మాఅమ్మ సమ్మతిస్తే వస్తాను.

సీత—(తనలో) ఆరాముడు మారాముడుకాదు కదా.

రాజ్యం—సోదరీ! పోయివస్తా! తప్పక దయచేయండి.

సీత—చిత్తం.

రాజ్యం—బాబూ మరచిపోవాకు తప్పకరా. (నిష్క్రమించును)

సీత—ఆహా యీమెయమ యెంతటి దయార్ద్రహృదయురాలూ, అంద మునకుతోడు ఆత్మయూ మహాపరిశుద్ధమైనదే.

సీత—బాబులారా! ధర్మం! తల్లులారా! ధర్మం!

భైరవశాస్త్రి—ప్రవేసించి కాయకష్టం చేసుకొని జీవింపరాదుటే.

సీత—చిత్తం! సిద్ధంగానే వున్నాను. అపరిచితమైన యీచిన్నరాజధానికి నేడే చేరితిని. కనుక స్థిమితముగా యిక యెక్కడనైనా దాసీపనికి కుదురుకొని జీవిస్తాము. ప్రస్తుతము యీబాలుడు ఆకటిబాధ కోర్వజాలక తపించిపోతూన్నాడు. ఏదైన తిండికను గ్రహింపండి పొట్టనింపుకుంటాము.

భైర—ఇదంతా యెందుకూ మాకు దాసీది అవసరము గనుక నీవు కుదురుగా నుంటానంటే తీసుకపోతాను.

సీత—చిత్తం!

భైర—అనుష్టానానికి వేళమించి పోవుచున్నది. త్వరగా పదా మరి.

సీత—మహాప్రసాదము. బాబూ వీరితో పోదాం పదా.

బాల—అమ్మా! వీడిని చూస్తే నాకు భయ మేస్తున్న దమ్మా.

సీత—బాబూ! అట్లనకూడదు.

భైరవ—వోరీ! కుట్టా ఈకూరగాయలనంచి పట్టుకరా.

సీత—స్వామీ! వాడు తేజాలడు. కుమారుని లేతచేతులు కమలిపోతాయి నేనున్నానుగా తీసుకరావడానికి...

భైర—ఓహో ప్రథమములోనే హంసపాదా. (నిష్క్రమింతురు)

తెర వ్రాలును.



ఓం

శ్రీవీరాంజనేయాయనమః.

# యధార్థము

## ( లేక పతివ్రత )

### చతుర్థాంకము—ప్రథమరంగము.

సముద్రప్రాంతం... మన్మధరావు... (తూలుతూ ప్రవేశించి) సీత పతివ్రత మహాపతివ్రత మహామహాపతివ్రత (పిచ్చి నవ్వు నవ్వి)

ఉ. ఓయి కవీశ్వరా పలుకు ♦ మోయి యదేమి రచించు గ్రంధమో
దాయక చూపుమోయి ఫల ♦ దాయినియైనచో మెచ్చుకొందు ఛా
న్యాయము లేని నాటకము ♦ న్యాయము లేని ప్రబంధగ్రంధముల్
వ్రాయకు సీత సాధ్వియని ♦ వ్రాయుము వాల్మికివోలె భక్తితో.

ఓ ఆంధ్రపత్రికాధికారులారా! ఓ సర్వపత్రికాధికారులారా! ఇదేనా మీ న్యాయము మీరైనా మా సీత పతివ్రతని చాటలేరా.

చ. నిజమును చాటలేరొకొసు ♦ నీతిని లోకముకల్ల డింప బ
ల్గ జగజలాడిపోవుటకు ♦ కారణమేలనో తెల్పరాదె యీ
త్రిజగములందు సీతమొ న ♦ తీమణి యంచని దూరదృష్టితో
సుజనులు మెచ్చగా రచన ♦ శుభ్రతగా ప్రచురింపరాదొకో.

ఓయీకథక శ్రేష్టా జష్టా పాపిష్టా మోదరష్టపుభ్రష్టా విన్నే.

ఉ. ఓహరిదాసుడా పిలువ ♦ నోయన వేమిర నోరు మెండితే
దాహము పేరుజెప్పి సుధ ♦ త్రావెడి నీ కివు డెంత బెట్టురా
శ్రీహరిచింతనామృతము ♦ చిల్కుచు నా కిక మూర్ఛవచ్చు రా
సాహసమున్న సీతకథ ♦ చాటుము పుక్కిటిగాధ లేలరా.

ఓచలనచిత్రారాధకులారా!

ఉ. ఎందుకు వన్కిరాని కథ ♦ తేర్చుచు ఫిల్మును దీతు రేలరో
మందుడ మంచి తెల్విగల ♦ మానవ శ్రేష్ఠుడ వైన వెంటనే
యందముగాను సీతకథ ♦ యాంధ్రు లకేమవిదేశజుల్ మహా
నందము నొందగా ఫిలుము ♦ నందున జూపుము యన్య మేలరా.

సీత పతివ్రతని చాటలేక చిక్కుచివికి సొక్కిసోలి పోతుంటే మీరంతా నన్ను చూచి వికావిక నవ్విపోతున్నారా ఓజాతి నీతి యభిమానాదుల విసర్జించిన మానవాధముల్లారా! మరల నా యీఘోరప్రతిజ్ఞను వినండి.

ఉ. సీత సుశీల గాదనుచు ♦ చిత్తములందు తలంచు నట్టివో
పాతకులార నానుడుల ♦ బాగుగ మీ రివు డాలకింపుడీ
మీతలకాయలందు మిను ♦ మిక్కిలి నోళ్ళలో పుండ్లు పుట్టగా
జూతును నేనుగూడ మిము ♦ జూచి వికావిక నవ్వె దప్పుడే.

సీత పతివ్రత మహాపతివ్రత ఓమహాజనులారా! సీత మహా మహామహాపతివ్రత (వెకిలి నవ్వునవ్వి) ఓయీసాగరా ఈ పాశ్చాత్యప్రపంచమునకు సీత పతివ్రతయని యెంత చెప్పినను వినక చప్పరిస్తున్నారు. నీకన్న విశాలహృదయురాలగు మా సీత పతివ్రత కాదని నీవు చెప్పగలవా...?...మాసీతప్రభా వాగ్నికి తాళలేక అగ్నిదేవుడు కూడా హడలిపోతున్నాడు.

ఓయీసాగరా యిక దుముకుతున్నాను నన్ను పరలోకము
నకు పంపుము సీత పతివ్రతని హాయిగా ఆనందంగా అక్కడ
కూడా ప్రచారం చేసుకుంటా—
(అని దుముకుటకు దుస్తులు విప్పుచుండ తెర వ్రాలును.)

## ద్వితీయ రంగం.

---

(భైరవశాస్త్రి యింట్లో సీత దాన్యం చేస్తూ తనలో)

చ. కరువగు కాలవార్నిధిని ♦ కష్టతరంగము లెన్నొ యడ్డినన్
బరబర నాదు జీవితయ ♦ భాగ్యపునా విపు డేగుచున్న దే
దరికొ గ్రహింపజాల నిక ♦ దాన్యతుపాను మహా త్తరంబుగా
పెరుగుచునున్న దీదెన గు ♦ శేలున కూల్చునొ తెల్పునోకదా.

భైరవశాస్త్రి ప్రవేసించి—ఓసీదాసీ?
సీత—ఎందుకు బాబూ.
భైర—మడిగుడ్డలు పిండుకొచ్చావా?
సీత—చిత్తం పిండకొచ్చాను.
భైర—అంట్లుకూడా తోమేశావా?
సీత—చిత్తం యేవొక్కటీ తక్కువ లేకుండా చెయ్యవలసిన పనులన్నీ
చేసివేశాను యిక నేను పోవచ్చా.
భైర—వీలులేదు. ఈనాడు మావాండ్రుకూడా వూళ్ళో లేరు ఇక
మనయిష్టమే యిష్టము హాయిగా యీవేళకు నీవుకూడా యి
క్కడే కాలక్షేపం చెయ్యొచ్చు.

సీత—బాబూ! పిల్లవానిని విడచి వొంటరిగా యెట్లుంటాను—

పోష్టుబమాను—(ప్రవేశించి హనుమాన్ వేషముతో) వీడింట్లో యేదా సీదికూడా నిలవ లేదు కర్మం జాలక యేయెవ్వరైనా కుదిరితే దానిని చెరచటమో లేక దొంగతనం పైనేసి యివ్వవలసిన పైకం యివ్వకుండా వెళ్లగొట్టటమో వాడుకైవున్నది. ఇప్పుడు ఈఅమ్మగారు యెవరో పాపం యీమెను యేమి చేస్తాడో యీదున్న.

భైర—నీకు తోడు పిల్లవా డెందుకూ లగలాటకం. ఈరాత్రికి నీవిక్కడుంటే కలుగబోయే లాభం ఆబోగం రంగసానికికూడా కలుగబోదు.

పో—ఓరి నీపిల్కవూడా అనుకున్నంతిపనీ చేయడానికి సిద్ధంగానే వున్నావటరా వుండూ వుండూ నాయీ లోకతోటి నీభర్తం వడతాలే.

సీత—మిగతాలాభాలతో నాకు నిమిత్తం లేదు — నాపుత్రుని చూచుకొనుటే నాకు మహాలాభం కాన నాదారిని నన్ను పోవనిమ్ము.

భైర—తిమ్మన్న బంతికి రమ్మంటున్నారు పాపం నాదారిని నేను పోతానంటే వూరుకుంటానా.

సీత—వూరకోక న న్నేమి చేస్తారు.

భైర—నీయధరసుధామృతాన్ని గ్రోలివేస్తాను.

పో—ఈలోపలనే రావణాసురుని పక్కలోనికికూడా వంపిస్తాను.

సీత—క్రూరా!

సీ. క్రీతము సైరంధ్రిని ♦ కీచకుం డిట్టులే
చెఱచగా నెంచి తా ♦ చెడగ లేదె
అది సీతను మున్ను ♦ యారావణబ్రహ్మ
యేలుకో తలచి తా ♦ కూలలేదె

పార్వతీదేవిని ♦ పట్టగానెంచి యా
తులసిపెన్మిటి మున్ను ♦ ధూళిగాడె
ధర కిరాతుకు డల ♦ దమయంతిపైబడ
దలచుట చేతనే ♦ దగ్ధ మవడె
తే. ఇంక దుశ్శాసనాదు లీ ♦ యిహామునందు
యింతులను రచ్చపాల్చేసి ♦ హీనగతిని
నీల్గగా లేదె వోరోరి ♦ నీచ భ్రష్ట
యట్లు నీల్గక న న్నువు ♦ వదలగ నిమ్ము.

శైర——ఏమాహొగరు. సీతాత యిక్కడికెవ్వరొస్తున్నాడనీ అంత నిర్భయంగా రేగిపోతున్నావు.

సీత——పాపీ! సర్వజనహితకరుడగు శ్రీవీరాంజనేయుడు లేడా! ఆనాడు సీతామహాదేవి మానప్రాణముల కాపాడిన మహానుభావుడు యీనాడు నావంటి అబలామణుల గాపాడ లేడా.

పో——ఈనాడు నేను హనుమాను వేషము వేసుకొచ్చినందుకు సమయానికి వీడు నాకు చిక్కినందుకు ఈమె శ్రీవీరాంజనేయస్వామివారి పాదభక్తురాలైనందుకూ న్యాయప్రయోజకత్వం ఫలించిందన్న మాట యీనాడు.

శైర——ఓసి పిచ్చిదానా! ఈశ్వరుండే నాకు వశమైపోయాడు కదా యిక హనుమంతుడా నాకు అడ్డొచ్చేది. అయన కుమారుడే ఆ హనుమంతుడు కాబట్టి ఇక ఆయనకూడా నాకు వశులైపోతాడు. ఆపై నీవుకూడా నాకు వశురాలవై పోతావు — ఏదీ ఒక్కసారి నను కౌగలించుకోనిమ్ము. (అని దగ్గరకు దగ్గర చేరుచుండ)

సీత——హా! నన్ను రక్షించువాడు లేరా స్వామీ వీరాంజనేయా యెక్కడున్నావురా తండ్రీ.

భైర—లేరు సీతా! నిజముగా నిన్ను సంరక్షించువారు లేరు. నిన్ను నేను సంరక్షింపవలయును నన్ను నీవు సంరక్షింపవలయును మనలను మరెవ్వరు సంరక్షిస్తారూ...? కావున నాకౌగిలిలోనికి రమ్మా సంరక్షింపబడతావు. (అని పైబడ జూచుచుండ వీరాంజనేయుని వేషముతో ప్రక్కన దాగివున్న పోష్టుజమాను కుప్పి గంతు లేస్తు హానుమాన్ బస్కీలు తీస్తు తొడలు చరస్తు వాళ్ళ దూకు భైరవశాస్త్రియందు దూకును)

పో—భైరో వద్మాష్! నిన్నిప్పుడు చీల్చివేస్తాను.

భైర—(గడగడ లాడుతూ) ఓహో! వీరాంజనేయస్వామివారా. ఇచ్చటికి యీశ్వరుడు పంపగా వచ్చారా స్వామీ తమరు దయ చేయండి.

పో—లేదు. నీకు తగినప్రాయశ్చిత్తాన్ని చేసిపోవడాని కొచ్చాను. కూ్రరా ఈమహాపతివ్రతను, ఆదిసీతను మరిపించిన యీమహాసీతను కేవలము కలియుగ రావణాసురుడవై గవయుజూచుచున్నావా మూర్ఖా చూడు నిన్నిప్పు డేమి చేస్తాను.

భైర—మహాప్రభూ మీనాన్నగారికి నేను ప్రియభక్తుడను. నేనంటే పడిచస్తారు — కాబట్టి మీరు కూడా.

పో—నీ సంగినంగి వేషాలు యిక్కడ చెల్లవు. సీతా! ముందు నీవు యిచ్చటనుండి యెచ్చటికైన పొమ్మా, ఈభైరవశాస్త్రిగాడిని తోకతోటి కొట్టి మట్టిచేసి వసాను.

సీత—చిత్తం. (నిష్క్రమించును)

భైర—శాంతించండి మహాప్రభూ శాంతించండి.

పో—ఓరీ భైరవా నిన్నిప్పు డేమిచేస్తానో చూడు.

భైర—నాతప్పు క్షమించి హానుమా మీతోక ఝాడింపకుండావుంటే మీకు తిన్నన్ని యిడ్డెనులు నైవేద్యం చెల్లించుకుంటా.

పో—ఏడిశావు సాంబారుతోసి యిడ్లీ యెవడికి కావాలెనురా.

భైర—సాంబారుసహితము గా సమర్పించుకుంటా మహాప్రభో.

పో—అంతమాత్రానికే శాంతించే స్వామికాదు యీవీరాంజనేయ స్వామి తెలుసునా.

భైర—కావాలసాస్తే స్వీట్లు పేట్లు వుప్మా సమర్పిస్తా. వాయిలకు వాయిలు పెసరట్లు వాయినాలుకూడా యిచ్చుకుంటా నాతండ్రీ.

పో—ఈకోతిరావు సంగతి నీకు తెలియదా భైరవా.

భైర—తెలుసును. మహాప్రభూ! బూరెలు, గారెలు, లడ్లూ, మైసూరుపాకు, జాంగ్రీ, ఢిల్లీపాదుషా, గోదుమపాలన్నీ తిన్నన్ని తెప్పిస్తా.

పో—ఛీ! లుబ్ధుడా! ఈకాస్తవాటికే లోబడతానా.

భైర—పానకం వడపప్పు కొబ్బరికాయలసయితముగా తృప్తిపరుస్తా.

పో—ఛీ! భడవా! అసలు నాకు ముఖ్యమైనవి చెల్లిస్తానని చెప్పనే చెప్పవేలనురా.

భైర—సారాయా.

పో—ఊ.

భైర—తెప్పిస్తాగా.

పో—ఆలస్యమైతే తోక జాడిస్తాగా.

భైర—సామీప్యములో వుంటేగా.

పో—లేకపోతే స్వామివారి ముద్రయినా చెల్లించాలెగా.

భైర—ఐతే చెల్లిస్తాగా.

పో—సరే చెల్లించు.

భైర—ఇదిగో ఇది పుచ్చుకోని సంతోషించిపోండి.

పో—మంచిది. రేపు నాపేరిట పేదరిట సమారాధన చేయాలిసుమా.

భైర—చిత్తం.

పో—అట్లా చెయ్యకపోతే మానాన్నగారితో చెప్పి నీకు యివ్వవలసిన వరాలు యివ్వకుండా చేయడమే కాకుండా నీడొక్క చెక్కే యిస్తా. జాగ్రత పోతున్నా పోతున్నా.

భై ర—ధన్యోస్మి. (అదృశ్యుడగును.)

తెర వ్రాలును.

తృతీయ రంగం.

---

(సీత విచారిస్తూ నొకధర్మసత్రంలో కూర్చొని)

ఆహా నాజీవితమంతయూ దుఃఖమయమేకదా భగవంతుడా నన్నేల సృజించితివి. సృజించితివే పో నా కాయుర్దాయమేల నధికముగా పోయుచుంటివయ్యా! జగద్రక్షకా దాస్యవృత్తిచే జీవింతమని తలంచితినేగాని కామాతురుడై న న్నీరీతి బాధించి నాకు రావలసిన బత్తెముకూడా యివ్వక న న్నవమానపరచి వెడల నడిపించునని కలనైనా తలంపనైతినికదా. చివరకు ముక్కుపచ్చలారని పసిబిడ్డను వాసిగల కుటుంబమున జన్మించిన పుత్రుని మధూకరవృత్తికి నలవాటు పరపవలసివచ్చినది. ఈ పాడుపొట్టకు యెట్టినీచపుపనులు చేయాలసొచ్చింది.

బాబు—(ప్రవేశిస్తూ) అమ్మా! అమ్మా.

సీత—నాతండ్రీ! నాముద్దులయ్యా వొచ్చావా నీకొరకే యెదురు తెన్నులు చూస్తున్నాను.

బాబు—మరల యెందుకమ్మా యేడుస్తున్నావు.

లత—నీకోసరమే బాబూ.

బాబు—నాకోసర మెందుకమ్మా! నే నేమి చేశానమ్మా.

సీత—ఆలశ్యం చేశావని.

బాబు—ఇక ఆలశ్యం చేయనుగా.

సీత—సరే ఐతే ఇక విచారించాలసిన అగత్యం నా కింకే మున్నది బాబూ నీకీ దుస్తులు యెవ్వ రిచ్చారయ్యా.

బాబు—మనకు ఒకనాడు కానుపించి మాయింటికి రాబాబూ అని నన్ను ముద్దుపెట్టుకోస పోలేదూ. ఆయమ్మా ఆయమ్మ యింట్లో వున్నాయనా కలసి నాపాటకు మెచ్చుకొని నాకివి కొనిచ్చారమ్మా — ఆయన చాలామంచివాడమ్మా! ఆయమ్మకూడా చాలా మంచిది. నన్నుచూచి ఆయిరువురు యెంతమురిసిపోతారనుకున్నావు. నాకు వలసినవన్నీ ఇక ముందు వారే యిస్తారుట. చదువుకుంటే చదువుకూడా ఉచితంగా వారే చెప్పిస్తారుట. పైగా నాచెయ్యి చూచి సంగీతసాహిత్యాలల్లో నీకు మించిన చెయ్యి వుండదు బాబూ అని యెన్నోసార్లు యీఅర చేతుల్ని ముద్దులచే కడికి వేశారమ్మా. మనము రోజూ వూజ చేసుకొనే నాయన బొమ్మ లేదూ.

సీత—ఔను ఇదిగో ఇక్కడనే వున్నది.

బాబు—(చూచి) అంతా యీబొమ్మమాదిరిగానే వు:టాడమ్మా ఆయన.

సీత—నిజమా! నిజమా! నాబుల్లిబాబూ! నాబుజ్జిబాబూ ఎంత కమ్మంగా చెప్పుతున్నావురా తండ్రీ.

బాబు—నిజమేనమ్మా ఆవంతయూ భేదంలే దమ్మా—

సీత—ఏమో మానవుని పోలిన మానవు లుండకూడదూ. (తనలో)

బాబు—అదికూడాగాక ఆయనకూడా అస్తమానంసీలాగంటిబొమ్మను పొట్టమీద పెట్టకోని చూసుకొంటూ అప్పుడప్పుడు ముక్కి ముక్కి యేడుస్తాడుకూడా నమ్మా పైగా పిచ్చివాడులాగా ఆబొమ్మతో మాట్లాడుతాడు. హాసీతా అంటాడు. కళ్ళు కద్దుకుంటాడు. కన్నునిండా నీరుతోడి ఆవతానికే స్నానంకూడా చేయిస్తాడుండమ్మా.

సీత—ఇదంతా యదార్థమేనా బాబూ!

బాబు—సందేహ మావంతైయూ లేదమ్మా. రోజూ కన్నులారా చూస్తున్నాదానినే నీకు చెప్పేస్తున్నా నమ్మా.

సీత—(కన్నీరువిడుస్తూ) ఏమో నన్ను పోలిన దురదృష్టవంతురాండ్రు మెందరు లేకుందురూ—

బాబు—(కళ్ళల్లోకి జాలిగాచూస్తు) ఎందుకమ్మా! మళ్ళా కన్నీరు నింపుతున్నావు. నాతల నీకన్నీటితో తడిసి ముద్దయిపోతున్నది.

సీత—స్నాన మాడించుటకు వేడినీరైనా కాచి యివ్వలేని కన్నతల్లులు యిట్లాగే వేడికన్నీరుతో బుద్ధిశాలురగు పుత్రులకు తలకు పోస్తుంటారుట బాబూ! అట్లాగే నేనుకూడా నీకు వేడినీరు కాచి యివ్వలేనప్పుడు యేమిచేసేదీ మరి.

బాబు—ఉన్న కన్నీరంతా నాకే తోడిపోస్తుంటే కన్నులు మెండి పోతే బాధ కాదమ్మా! నన్ను కనిపెట్టివుండేవి నీకన్నులేగా.

సీత—లేదులే బాబూ లేదులే. అడుగ మరచితిని. ఇంకా నిన్నేమైనా అడిగినాడా.

బాబు—నీ కేమికావాలీ అని అడుగుతాడమ్మా!

సీత—నీకులగోత్రాదు లేమైనా అడిగినాడా?

బాబు—అడిగినాడుకాని నేనే చెప్పలేదు.

సీత—బాబూ నాదుఃఖారణ్యానికి వెన్నెల కాయిస్తున్నావు. చల్లని

గాలికూడా వీయిస్తున్నావు. పునాదులు కట్టిస్తున్నావు. ఇక భవనాలనీ పట్నాలనీ కట్టించడమే తరువాయి (అని ముద్దులు పెట్టుకొనుచుండ తెర వాలును.)

## చతుర్థ రంగం.

రామం—సీతను విడనాడి సుమారు యిప్పటి కేడెనిమిది వత్సరాల కాలపరిమితి దాటినది. పిల్లవాడు కల్గినాడనియు తరువాత తాత దివంగతుడైనాడనియు మన్మథుడు నున్మత్తుడై దేశాల పాలై పోవుటయేగాక సీతకూడా పుత్రునితోసహా దేశమ్మ కానిదైపోయినదనియూ గిరిరావు నాకు అప్పుడప్పుడు అక్కడ జరిగే సమాచారాదుల లేఖరూపముగా తెలియజేస్తు వుండేవాడు. ఇప్పుడు ఆయనకూడా లేఖలు వ్రాయకపోవటమే కాకుండా ఆయనజాడకూడా నాకు బొత్తిగా తెలియుటలేదు. కటకటా ఇన్నివత్సరాలు జరిగిపోయినప్పటికీ సీత నన్ను వీడిపోలేదు. నిజంగా అది ద్రోహురాలే ఐతే దానిని నే నెందుకు మరచిపోకూడదూ—

తే. మరతుమన్నను మత్ప్రియ ♦ మఱపురాక
నిత్యమును యెట్టయెదుట తా ♦ నిలచినాథ
నామనోనాథ నాప్రాణ ♦ నాథ యనుచు
పుత్రుడునసహా నాపాద ♦ పూజనలువు.

తే. అనపరాధగు సీతపై ♦ యకారణముగ
నిందమోపుచు యీరీతి ♦ కుందజేయ
యఘము సుమ్మని యన్మదీ ♦ యాత్మ యేలో
పోరుచున్నది లోలోన ♦ ఘోరముగను.

తే. ఏమిసేయుదు యిప్పుడు నా ♦ కేదిదారి
సీతజాడలు నాకింక ♦ చిక్కకుట్లు
చిక్కి దోదూయమానమై ♦ చిట్లుచున్న
యాత్మశాంతికి యెవ్వరు ♦ యభయమిత్తు.

రాజ్యం ప్రవేసించి—రామం! రామం!

రామం—(చూచి) రాజ్యం! అప్పుడే తిరిగి వొస్తున్నావేమీ... ఇం
చుక బాహ్యాళికి పోయివచ్చెద నంటివే.

రాజ్యం—నీవులేకుండా నేనొక్కదానినే పోవుట కిష్టములేక వొచ్చే
శాను రామం!

రామం—నావల్ల నీకు బాధ కలుగుతున్నప్పుడు నే నెందుకు నేపోతాను.

రాజ్యం—వలదు వలదు నీవుపోతే నాప్రాణము మొదలే పోతుంది.

రామం—నావల్ల నీకెట్టిబాధలుకూడా కలగటం లేదంటే వుంటాను.

రాజ్యం—నీవల్ల నాకెట్టిబాధలూ లేవు కాని—

రామం—అదిగో మరల కానీ అని కామాతో నరిపెట్టితివి.

రాజ్యం—కాని మనయిరువురమూ యేకమైనచో మనయానందమునకు
మేరకలదా రామం!

ఉ. నీవు నవీనదివ్యనవ ♦ నీతమనోజ్ఞవికాసతోషస
ద్భావసుగానచంద్రికవు ♦ వర్రెక్కన నేను కవిత్వసారసం
జీవసుధౌషధంబిడుచు ♦ చిత్తవికాసము కూర్చుచంద్రిక
నీవును నేను యేకముయి ♦ నిల్చిన స్వర్గము నిర్గమింతమే.

రామం—రాజ్యం! సోదరీప్రేమతో నెంతటిసౌఖ్యమైననూ జూరకొన
గలము.

రాజ్యం—రామం అది కల్లమాట. ఇంకనూ యిటు వినుము.

ఉ. నీవు రచింప కీర్తనలు ♦ నిన్నలరింపగ నేను పాడెదన్
నీవు నటుండవైన యెడ ♦ నీవలెనే నటివేష మేసెదన్
నీవొక శిల్పకారి వవ ♦ నీకృపచేతను శిల్పి నయ్యెదన్
నీవును నేను యేకమయి ♦ నిల్చిన రెండవస్వర్గ మేలమే.

రామం—సృష్టిలో సోదరసోదరీమణుల ప్రేమయే నిరంతరానంద దివ్యా
మృతప్రవాహవాహినిలో తేలి యాడింపజేయునది. నేను కోరు
నది నీవు అనుసరింపవలసినదీకూడా తెలుసునా అప్పుడు స్వర్గమే
కాదు మహాస్వర్గమునుకూడా యేల గలుగుదుము.

రాజ్యం—రామం! శారీరకముగా! మానసికముగా సత్యధర్మాదు లొక
దానితోనొకటి మిళితమై యున్నట్లు స్త్రీపురుషు లేకమైతేనే
గాని నూతన యిహస్వర్గాన్ని సృష్టింపలేరు.

చ. ఇరువుర మేకమౌచు కడు ♦ యింపుగ పాడిన మేరుమందరుల్
కరగియు కాల్వలౌచు కల ♦ కాలము యింకక కృష్ణరీతి యీ
వరమనుపూజ్యభూములకు ♦ బాగుగ పారుచు జీవకోటికిన్
కరువుల కాటకంబులను ♦ కన్పడ నీకను శాంతి గూర్చ మే.

కావున అనుగ్రహింపుము.

రామం—రాజ్యం! బాధితహృదయుడనగు నన్ను పిచ్చియీరీతిగా
బాధింపక యించుక దినప్రతిక నన్నా చదువకూడదూ హాయి
గా వింటాను.

రాజ్యం—మీ కెందుకు నాపై అంతటి విసుకుకలగటం సరే చెయ్య
మన్నపనే చేస్తాను మరివినండి.

రామం—బుద్ధిమంతురాండ్రి కుండవలసిన లక్షణాలిట్టివే కాబట్టి చదువు.

రాజ్యం—(చదువుతూ) వినండి విశాఖపట్నంలో వింతప్రమాద వైఫల్యం.

రామం—ఏమిటీ వింత ప్రమాదమూ.

రాజ్యం—ఔను. నిన్నటిరోజున ఒకయువకుడు ఒకలేఖను వ్రాసి తన దుస్తులతోసహా సముద్రపుటొడ్డున పెట్టి తాను సముద్రగర్భమున జొరబడినాడు. ఆదృశ్యమును చాపలుపట్టువాడొకడు చూచి తక్షణం వానిని సంరక్షించినాడు. ప్రాణభయము కూడా తప్పిపోయినది. ఇప్పుడు విశాఖపట్నపు వుచితవైద్య శాలలో చికిత్సపొందుతున్నాడు. ఆ లేఖసారాంశమేమనగా— ఓరామమూ నాఅంత్యసందేశం యేమన సీత అపవిత్రురాలు, అప్రతిష్టాపరురాలు, అపభ్రంశురాలూ కాదు. అమాయక రాలు. అతిసున్నితహృదయురాలు, మహాపతివ్రత కాన నీవు చేయుచున్న అగ్నిపరీక్షల నికనైన నుపసంహరించుకొని సీతను సంరక్షించుకొనుము. సీతనిమిత్తమై నాప్రాణముల బలిగా నొడ్డ నంతకాలమూ నీవు యథార్థమును గ్రహించుకోజాలవేమోనని తలంచి యిట్లు చేసితిని. పైగా నాకొరకు విచారించువారెవ్వ రున్నారూ ఒక్కసీతయేగా. ఆమెకు విచారము తప్పగలందు లకేగా నేనీ యాత్మహత్య చేసుకొనదలంగితిని. కాన యిక నైనా మీరిరువురూ ఆనందశాంతోదులు కలుసుకొని జీవిస్తు న్నట్లు యేకమై సుఖింపండీ. ఇట్లు,

సీత ప్రియసోదరుడు 'మన్మథరావు.'

అని యున్నది గనుక వారితరపువారెవ్వరైన వచ్చి తీసికొని పోవచ్చునని తెలియజేయడమైనది.

రామం—హా మన్మథా! నీయెడ నేనెట్టి ద్రోహముచేసితి నోయీ.

రాజ్యం—రామం! నీనేత్రము లట్లు యరుణములై యశ్రుపూరితములై పోయినవేలా నీహృదయ మెందుల కట్లుకంపించి పోవుచున్నది.

రామం—అమాయకులకు అగచాట్లు కల్పించినందులకు.

రాజ్యం—మీమాటలు నాకేమీ అర్థం కావడం లేదు.

రామం—ఏమనిచెప్పేది నీకు రాజ్యం! ఆమానవున కిన్నికష్టాలు కల్పించినది యీమానవాధముడే. అమాయకురాలగు సీతను అనుమాన పిశాచావేశమువలన మాతృదేవి హితోపదేశము నైననూ నరకుగొనక ఎంతెంత దుస్సహ దుర్నిరీక్ష దుర్భర ఘోరాలు ఘోర కష్టపరంపరల కాహుతులుగా నొప్పగించిన కలుషాపహారా డీనూత్న రాముమే రాజ్యం! అబ్బా! నాతల బరువెక్కుతున్నది నాహృదయము బండబారిపోయినది. నా కడుపులో శ సహస్ర సహస్రాంగలికత్తులు కదలిపోవుచున్నవి. న్యాయం కృతాపరాధము.

చ. నిరుపమశీలరాశివయి ♦ నిష్కరుణుండను నీతిమాలుడన్
భరమగు నిందమోపి యెడ ♦ బాపితి పుత్రికూడ జూడకే
ధరవయి యున్నదో యిపుడు ♦ దారుణనిందపిశాచిచుట్టిలో
జోరబడి సాక్షి సొమ్ము పతి ♦ జోలియు సైతము లేక కూలెనో.

హామన్మథా! విపుల విషాద విషఘట్టములో నిన్ను మట్టు పెట్టిన యీపాషాణహృదయుని శపింపక క్షమింపగలవా తండ్రీ! ఈజారమయుప్రపంచమున నీయట్టియాదర్శకపురుషు లింకా యేకొందరో వుండుటచేతనే సూర్యచంద్రాదులు గతులు తప్పకుండిరి.

రాజ్యం—రామం! ప్రాణభయము తప్పినదని యున్నదికదా ఇక మీరంత విచారింప నక్కరలేదు. ఇక నావిచారముకూడా సన్నగిల్లుచున్నది.

రామం—రాజ్యం! మన్మథరావున కెట్లున్నదో శీఘ్రమే తెలుపుదని తంతియిచ్చి రాగలవా.

రాజ్యం—అనవసరముగా తంతి యెందుకూ తీసుకొని వచ్చుటకు మనిషినే పంపి వచ్చెదను.

రామం—రాజ్యం. నీకెంతయో పుణ్యముండును. అతిశీఘ్రముగా కావలసినంత అర్థమిచ్చి తీసికొనివచ్చుటకు పంపి రమ్ము.

రాజ్యం—నందేహమా. రేపీపాటికి రానే వొస్తారు. జాగ్రత్త నేను మనిషిని పంపించి యిప్పుడే వస్తాను. (అని నిష్క్రమించును)

రామం—(తనలో) సీతా.

తే. ఎక్కడుంటివో యెంతగా ♦ గ్రుక్కినావొ
అన్నపానాదులును లేక ♦ యలమటించి
పుత్రితోగూడ తుదకు యీ ♦ పుడమిపీడి
యాదిసీతకు జెప్పగా ♦ యరగినావొ.

తే. ఎంత ఘోషించి ఘోషించి ♦ స్వాంతమంతు
నన్ను దూరుచు కడకు నీ ♦ కన్నసుతుని
యెవరిచేతుల కందించి ♦ యేగినావొ
కాక వుంటివో కష్టాల ♦ కాంతవాడిలో.

తే. నిన్ను యపనింద కెరజేసి ♦ యున్నఖలుని
కావదగ్ధుని జేయక ♦ శాంతముగను
కటికదారిద్ర్య రాకాసి ♦ కాళ్లకడను
పుత్రితోగూడ యెట్లుండ ♦ పూనినావు.

తే. అమితగారాబమున నిన్ను ♦ యక్కటకట
పెంచిపెద్దగ జేసి యీ ♦ పెంకె కిచ్చి
నట్టిమీతాత నన్నెట్లు ♦ తిట్టకుండ
యసమించెను నీపైని ♦ యాశలొదలి.

తే. ఒక్కగా నొక్క యీచుక్క ♦ దక్క నాకు
దిక్కులేరింక నీకన్న ♦ దీనురాల
కనుచు నాకొప్పగించిన ♦ ఆంధ్రమణిని
తాతగారినే మ్రింగితి ♦ దారుణముగ.

బాబు—(పాటతో ప్రవేశం) పాట.

స్థూలదృష్టి లేకా రామా
సీతను విడతువె శ్రితధామా ॥స్థూ॥
ఏమి ధర్మ మిది ఏమి పుణ్యమిది శ్యామా
ఏలవీడితివో భీమా ॥స్థు॥
అన్ని మెరిగిన గణ్యుడవని నిన్
మిన్నగ నమ్మిన చిన్నది రామా
ద్రోహము చేయుట దోషము నీ కది లేమా ॥స్థు॥

రామం—(కన్నీటితో) బాబూ! ఎంతకమ్మగా నున్నదోయ్ ఆపాట.

బాబు—మావంశములో పుట్టినవారు పుట్టబోయేవారుకూడా అపర గానతుంబురులవలె యిటువంటిపాటలు తల్లిగర్భాల్లో నేర్చు కొనే పుడతారుట.

రామం—నీవు యీపాట పాడుతూవుంటే నా కెందుకో ఆనందశోకా దులు రెండుకూడా వస్నా వేసిస్తుంటాయి.

బాబు—అంటే పాటలో లీనమైపోయి మిమ్ములనుకూడా లీనము చేసు కోగలుగుతున్నా నన్నమాట

రామం—విందామంటే వినా లేను. మానేతామంటే మానెయ్యా లేను.

బాబు—అంటే పాపకృత్యాలు చేయకూడదూ అని అనుకొని చేస్తు వుండేవాడిలాగా వుంటుందన్నమాట!

రామం—ఔను కానీ నీ కీపాటలు మెవరు నేర్పిరి బాబూ.

బాబు—మామామయ్యగారు నేర్పారు. అస్తమానం ఆయనగారు కూడా యీపాటలే పాడుతూ నాచేతకూడా పాడించేవారు.

రామం—ఇప్పుడున్నారా—?

బాబు—లేదు. మానాన్నగారితో పాటు ఆయనగారినికూడా యేదో వొకమాయభూతం లాక్కొనిపోయింది.

రామం—హరి! హరి! భూతమా.

బాబు—ఔను అనుమానభూతం.

రామం—నన్నే ననుకున్నాను. ఈప్రపంచంలో చాలామందిని యీ ద్బుక పోతూవుంటుంది. కామాలి ఆపాడుభూతం.

బాబు—ఔను మంచిదాంపత్యాన్ని చూచి మాయదారి బ్రహ్మ వోర్చుకోలేక యిటువంటి భూతాలనుప్రయోగంచేస్తుంటాడుట.

రామం—బాబూ! నీవు చెప్పేదంతా యదార్థమేనా?

బాబు—ఆపాడుబ్రహ్మ మానాన్నగారిపై ఘోరవికృతాకారధారిణగు యనుమానపిశాచభూతాన్ని ప్రయోగం చేసేటప్పటికి మతి పోయి మానాన్నగారు దేశాలపాలై పోయినాడు. ఆభూతం ఆయనగుండెకాయను వుక్కుగుండెకాయగా మార్చిందిట. ఆయనకన్నులను యినపకన్నులగా చేసిందిట. అందువల్ల ఆయ నిప్పుడు కరుణాహీనుడు, దయారహితుడై పోయాడుట.

రామం—నన్ను చెయ్యలేదూ అట్లాగే ఆపాడుభూతం పాపభీతిలేని పశుప్రాయునిగా చేసినది కామాలి.

బాబు—అంతటితో అది తృప్తిజెందక మాతాతగారిని పొట్టన పెట్టు కొనిపోయింది. తదుపరి సదా మాక్షేమముకోసరమై తనయావ శ్చక్తినీ వినియోగింపనున్న మా మామయ్యను మతిభ్రష్టు నిగా చేసి మాకండగాకూడ లేకుండగా చేసిపారేసింది. తుదకు నన్నూ మాయమ్మనూ అష్టకష్టాలపెట్టుతూ నా కీముష్టిజోలె

చేతికిచ్చి పంపించింది. విన్నవారూ కన్నవారూ మీావలెనే కన్నీరు విడుస్తారు కాని మానాన్నగారిది ఉక్కుగుండెకాయ కావడంచేత పాషాణమత స్తావకులలో పరిపరిధములై పోవుట చేత శోకించనే శోకించలేరుట. ఒక వేళ వేడుకకు శోకించినను కన్నీరు రానేరాదుట.

రామం—ఏమో తప్పుచేసి కప్పిపుచ్చుకొనువానివలె నున్నది నా యిప్పటిస్థితి. బాబూ నీపలుకులు వింటున్న కొలందియూ, లజ్జా భయశోకాదులు మూడూ మూడుతీరాలై గుచ్చుకపోతున్నది నామేనునకు. చాలించకుందామా చెతం సమ్మతింపదు చెప్పమంటామా నాచుట్టూ నిప్పులే.

బాబు—ఆయనకు కన్నులు కలవుటగాని, నన్నూ మాయమ్మగారినీ చూడాలనంటే మాత్రం ఆకన్నులు బొత్తుగా కానుపించవట.

రామం—బాబూ నీవు చెప్పేమాటలు వింటుంటే నా కశాంతికరంగా వున్నప్పటికీ సుఖవంతంగానే వున్నట్లు నిస్తుంది మనస్సుకు.

బాబు—ఆయనకు చెవులున్నవిట కానీ మాదీనాలాపము లాచెవుల కసలే యెక్కవుట.

రామం—ఇవన్నీ నీ కెవరు చెప్పిరి బాబూ.

బాబు—మాయమ్మ మహాపతివ్రతగనుక ఆయనగారిపై నేరాలుయే వొక్కనాడైనా నాతో చెప్పిన పాపాన పోలేదు. అడిగినా చెప్పదూ కూడా పైగా నాన్నగారి వుక్కుగుండెను బెండుగా చేసివస్తానంటే వొద్దువొద్దని కన్నీరు పెట్టుకొంటుంది కూడాను.

రామా—మరెవ్వరు చెప్పారూ?

బాబు—వన్నెఱింగినవారూ, మాయమ్మగారి నెఱింగినవారు. పెద్ద మనుజులైనవారు, దివ్యజ్ఞానము కలవారూ, యథార్థాన్ని తఱచి తఱచి తెలుసుకోగలిగినవారూ చెప్పుకొనుచుండు విన్నమాట

లివ్వి. వింటూంటే యెందుకో మీరుకూడా మహావిలపిస్తున్నారే మానాన్నగారికి సోకిన ఘాలి మీకుకూడా యేమాత్రమైనా సోకిందా. పోనీయండి అంతకష్టంగావుంటే మానేస్తారేండి.

రామం—(కన్నీటితో) ఆహా!

ఉ. ఈతనినోటి వెంటబడి ♦ యిత్తర వెల్వడుచున్న పల్కులి
ప్పాతకకర్ణరంధ్రముల ♦ పడ్డకొలంది యనేకములుల్కులై
కోతను కోయుచుండె నను ♦ కొంచెముకూడను నిల్వనీక యీ
జాతకు డెవ్వడా యితని ♦ జాడలుసైతము చెప్పడేటికో.

బాబు—ఏమిటో అలోచిస్తున్నారే. మాయమ్మ రోగపీడితురాలై బాధ పడుతున్నది. నే పోవాలి. త్వరగా మధూకరం పెట్టించరూ?

రామం—అట్లాగా బాబూ! ఐతే త్వరగా యీరూపాయిని తీసుకొనిపో.

బాబు—రూపా యెందుకూ మధూకరం కావాలిగానీ.

రామం—మధూకరం పెట్టుటకు ఈనాటి రాజ్యం పనిమీద యిప్పుడే బైటకుపోయింది కాన సంశయించక రూపాయను పట్టుకపో.

బాబు—రూపాయితీసుకుంటే మాయమ్మ వూరుకోదు బాబు.

రామం—భయంలేదు బాబూ తీసుకపోయి భోజనానికి ఖర్చుపెట్టుకొండి.

బాబు—చిత్తం.

రామం—మళ్లాయెప్పుడు వస్తావో.

బాబు—తప్పక సాయంకాలానికి వస్తాను. (నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

---



ఓం

శ్రీవీరాంజనేయాయనమః.

# యథార్థము

## (లేక పతివ్రత)

### పంచమాంకము—ప్రథమరంగము.

భైరవశాస్త్రి పూజామందిరం.

భైర—శంకరా! భవదీయాజ్ఞానుసారం నాయాస్తిపాస్తుల నన్నింటినీ దానమిచ్చుకొంటిని కాన నాకు సాక్షాత్కరించి నన్ను నుగ్రహింపవా రుద్రా.

పోష్టుజమాను—(శంకరునిగా సాక్షాత్కరించి) శాస్త్రీ! వేడుకొన్నమాత్రమునసే మరల నీకు దర్శనమిచ్చాను. బాగా దర్శనంచేసుకో.

భైర—లింగా తమపునర్దర్శనభాగ్యం ఈమందభాగ్యునకబ్బినా తండ్రీ—

పో—శాస్త్రీ! నాఆజ్ఞలను శిరసా వహించి నెరవేర్చావా.

భైర—అక్షరాలా నెరవేర్చుకున్నాను లింగా.

పో—ఎవరెవరికి యెంతెంత దానమిచ్చావూ చెప్పవోయి భక్తాగ్రణీ.

భైర—భార్యాపుత్రాదులకు వున్నదంతా దానం చేసుకున్నాను లింగా.

పో—శ్రేష్ఠైన పనే చేశావు. ఐతే అప్పులవాళ్ళకు పాతచెప్పులన్నా వొప్పగించావా అదీ లేదా.

భైర—లేదు మహాప్రభూ! మీదయవల్ల వాళ్ళకు పండుపుల్లకాదు కదా పూటికపుల్లకూడా వొప్పగింపలేదు.

పో—అగ్గిపుల్లలాగంటివాడివి నీవెందు కిస్తావూ నాకు నిజమైన భక్తుడవంటే భైరవా నీవేనోయీ.

భైర—కనుకనే మీరు నాకు సాక్షాత్కరించారు. ఇంకో పుల్లాయకు అంతంతమాత్రము చేత కనుపిస్తారా. వరాలిస్తారా.

పో—అంతా బాగానేవున్నది మెచ్చుకొని లక్షవరాలు యిచ్చిపోయే వాడినేకాని ఒక్కరోతపని చేశావోయి.

భైర—రోతపనిని నే నెందుకు చేస్తాను.

పో—నీవు సీతను చెరచాలెనని తలంచడమే రోతపని.

భైర—ఈశుభవార్త మీకెవరు చెప్పినారు లింగా.

పో—నాపుత్రుడు హనుమంతుడు జరిగినదంతా నాకొచ్చి చెప్పినాడు.

భైర—పొరపాటు క్షమింపమని లంచ మిచ్చుకొన్నానుగా.

పో—క్షమింపమని హనుమంతుని వేడుకొన్న ప్రయోజన మేమున్నదీ ఆమహాతల్లినే వేడుకుంటే ఆమె అనుగ్రహిస్తుంది. ఆ మరుక్షణా నికే నేను ప్రత్యక్షమై యివ్వాలసిన వరాలిచ్చి పోతా. కావున వెంటనే పోయి ఆమహాతల్లిపాదాలముందు వ్రాలుము.

భైర—చిత్తం లింగా. సత్వరమే పోవుచుంటిని.

(తెర వ్రాలును)

## ద్వితీయ రంగం.

(రోగపీడితురాలైన సీత నట్రములో)

సీత—అనుమానపెనుభూతమునకు ఈప్రపంచ సంగ్రామ భీభత్సరూప ధారిణగు మహాభూతముకూడా తోడుపడి తలవిరియ బోసు

కొని భూకంపం కలుగునేమో యనునట్లు తాండవం చేస్తున్నది. ఓసీ యనుమాన పెనుభూతమా నాఖంటి పేదకాపురకుటీరాలలో యెందుకు తాండవం సల్పుతావే మాయదారి మహాతాటక వోసీ!

సీ. అనుమానదయ్యమా ♦ యాసించి పతికి నా
కెడలుచూవుచు మప్పు ♦ యేకినావు
అనుమానభూతమా ♦ యాసించి మమ్మట్లు
కష్టసంద్రమునందు ♦ కలపినావు
అనుమానప్రేతమా ♦ యాసించి మితిలేని
యపనింద పైద్రోసి ♦ యాడినావు
అనుమానపాపినీ ♦ యాసించి నిన్నహా
యులదేసి పీవెంతో ♦ యుబికినావు

తే. అష్టకష్టాదులను పెట్టి ♦ మాష్టియొత్తు
కొనెడి దుర్వ్యాప్తిహాల్చేసి ♦ గోడువెట్టు
మింక నైనను బాసిపో ♦ కిట్లు నీవు
యాడుచుంటివె నీయాట ♦ లంతరింప,

బాబు—అమ్మా! అమ్మా!
సీత—వొచ్చావా బాబూ! మధూకరాన్ని తెచ్చావా.
బాబు—మధూకరాన్ని కాదమ్మా యీనాడు రూపాయి తీసుకొచ్చాను.
సీత... బాబూ రూపాయిని యెవ రిచ్చారూ.
బాబు—రాజ్యమ్మగారియింట్లో వున్నాయనే యిచ్చాడమ్మా.
సీత—ఎవ్వరిని మోసపుచ్చి తీసుక రాలేదుకదా.
బాబు—లేదమ్మా నిజంగా ఆయనే యిచ్చాడమ్మా.

సీత—ఐతే సంతోషమే.

బాబు—ఇంకా విశేషంకూడా వున్నదమ్మా! వింటావా.

సీత—వింటాను వినుపించుబాబూ నీవాక్యామృతధారలచేతనే గా ఈ మాత్రమైనా జీవిస్తున్నాను.

బాబు—ఆయనగారూ సీతను విడతువరామా అనుపాటను పాడుతూ వుంటే యెక్కి-యెక్కి యేడుస్తా డెందుకమ్మా.

సీత—ఎందుకో నాకుమాత్రమేమి తెలుస్తుంది బాబూ.

బాబు—అమ్మా నాన్నవి ఆజానుబాహువులన్నావు కాదూ.

సీత—ఔను నీకుమలెనే ఆయనవికూడా ఆజానుబాహువులే.

బాబు—నా కీరూపాయి తీసుకోమని యిచ్చినవానివికూడా ఆజాను బాహువులే నమ్మా. అరవిందలోచనుడుకూడా కదూ నాన్న గారు—

సీత—ఔను.

బాబు—నీలమేఘశ్యాముడేనా.

సీత—ఔనౌను.

బాబు—ఐతే ఆయనగారుకూడా అరవిందలోచనుడూ నీలమేఘశ్యాముడూకూడా నమ్మా!

సీత—ఉండవచ్చు మీనాన్నగారి లాంటివారే యెందుకుండకూడదు.

బాబు—ఆయనగారిని చూస్తే నా కెంతో హాయి. ఆయనగారు నన్ను ముట్టుకుంటే యింకా హాయి! ఆయనగారు నన్ను యెత్తుకోని ముద్దులు పెట్టుకొంటున్నప్పుడు కల్లు హాయి చెప్పడానికే నా కలవికూడా కాదేమి టమ్మా.

సీత—అంతహాయి నీ కెందుకు కలిగెనో నాకుమాత్ర మెట్లు తెలుస్తుంది బాబూ.

బాబు—అమ్మా! నాన్న కనపడితే నీవు పలుకరిస్తావా.

సీత—ఎందుకు పలకరించనూ.

బాబు—నాతోపాటు ఆయనగారికికూడా అన్నం పెడతావా.

సీత—ఎందుకుపెట్టనూ నాబుజ్జితండ్రీ మనకు ఆయనగారికి భగవంతుడు మరెవ్వడున్నాడూ వారిని మనయిరువురమూ పూలతో పూజించాలికూడా.

బాబు—అమ్మా! ఆయనగారితో నీవు మాట్లాడిననూ, నేను మాట్లాడనమ్మా. దూషిస్తాకాని పూజించను.

సీత—బాబూ! తండ్రిని అట్లనకూడదు తప్పుకాదూ.

బాబు—మనల నీకష్టాల పాలుచేసిన తండ్రితోటి సిగ్గులేక తగుదునని నేనెట్లా మాట్లాడేదీ, యెట్లా పూజించేది.

సీత—వారు నిన్నేమి కష్టపెట్టిరిరా తండ్రీ.

బాబు—గర్భములో పడ్డదిమొదలుకొని ఈనాటివరకూ కష్టాలే పెడుతున్నారు.

సీత—హరి! హరి! ఎన్నడైన వారు నిన్నుకన్నారా. పల్లెత్తుమాటైనా అన్నారా.

బాబు—లేదమ్మా. నీవు జారిణివని లోకానికి చాటలేదటమ్మా.

సీత—ఆకష్టము నాకుకాని నీ కెందుకు బాబూ.

బాబు—నాకుగాక నీకా తల్లీ! నేను జారిణీపుత్రుడనా, నాజీవితమేగా కళంకంచేత పాడైపోయేది.

సీత—బాబూ! నేను పతివ్రతామతల్లికి జన్మించితినను విశ్వాసం నీకున్నచాలును. తక్కిన ప్రపంచముతో నీకు నిమిత్తమేమున్నదీ!

బాబూ—అడవికి పోకుండా ప్రపంచంలోనే వున్నాముగా మరిమనం.

సీత—తండ్రీ! కన్నా యేడాకులు యిను మిక్కిలిగా చదువుకొని పుట్టితివి. నీ కెవ్వరు సమాధాన మీయగలరూ వేళమించుచున్నది. అన్నం కలిపి పెట్టెదను లోనికి రమ్మా.

బాబు—ముందు నేను తిననమ్మా! తెచ్చినదంతా నాకడుపున కే తురిమి యరిమీా పెడుతూ నీడొక్క యెండ బెట్టుకొంటున్నావు.

సీత—నాబంగారుకొండగా నారత్నాల రాసిగా! రా. నాతండ్రీరా! నేనుకూడా నీతోపాటు కూర్చోని తింటాలే.

తెర వ్రాలును.

## తృతీయ రంగం.

(వీధి—గిరిరావు కుష్టుతో బాధపడుతూ ముష్టికి బయలుదేరును.)

గిరిరావు—ఆహా! నేటికి నే నొక దిక్కుమాలినవాని నై పోయితిని. పైగా చేతికి కుష్టువుట్ట భ్రష్టాకారుడ నై బిచ్చమడుగుకొనుటకు చిప్ప తీసుకొని గ్రామగ్రామానికి తిరగాలసిన గతి గట్టినది. చేసుకొన్నవారికి చేసుకొన్నంత మహాదేవాయని పాపఫలమును అనుభవింపవద్దూ. ఈజన్మమున చేసిన పాపము ఈజన్మముననే అనుభవింపవలసివచ్చినది వేరే నరకమెందుకూ. ఏనోటితోటి సీత అపవిత్రురాలని అడ్డమైనకూతలూ కూసి వాసి పోగొట్టితినో ఆనోటికే పుండ్లు పుట్ట పురుగులు పడ్డవి. ఏచేతితోటి సీత జారిణీస్త్రీయని లేఖలు రామమునకు వ్రాశానో ఆచేతికే కుష్టు పుట్టినది. ఈపాడు మొదరష్టపుకుష్టుచేయియేగా నిరపరాధియగు మన్మథరావును అన్యాయముగా కొట్టినది. కనుకనే ఆయన శాపము నాకు తలిగి తీరినది. మన్మథా! మన్మథా! నిజముగా నీవు

మహోత్తముడవోయీ. నీయట్టి సత్యసంధుని నిర్మలహృదయుని, స్వార్థరహితవిశ్వప్రేమమయుని, త్యాగధనుని కొట్టిన యీపాపాత్మునకు తగిన శాపమే యిదినాన్న తండ్రీ! అనుభవింతును. హా ఆకలి. బాబూ ఆకలి. బాబులారా ధర్మమెయ్యండి. తండ్రులారా ధర్మమెయ్యండి.

పో—(ప్రవేశించి) కష్టురోగికి యెవరేస్తారోయ్ ముష్టి.

గిరి—పోష్టుజమానుగారూ! కనికరింపండి.

పో—ఛీ! ఛీ! నీముఖము చూచిన మహాపాపము వచ్చును. సీతారాము మన్మధులకు నీవుచేసిన అపకారమే యీరీతిగా నిన్ను శిక్షించినది. అనుభవింపుము.

గిరి—జమానుగారూ! నిజముగా వారికి ద్రోహంచేశాను కాబట్టే అనుభవించుచుంటిని. అనుగ్రహించి ధర్మమేయండి.

పో—తూత్! కష్టువాడివి మేము ముష్టి యివ్వము (అని పోవును.)

గిరి—హా పరమేశ్వరా (మూర్ఛిల్లును.)

(తెర వాలును.)

చతుర్థ రంగం.

(రామం యేకాంతంగా కూర్చొని)

రామం—అహా!

ఉ. బాలను డాసినట్టి ప్రతి • పల్కును శ్రద్ధగ విన్నచో యవే
శూలములౌచు గృచ్చుకొని • ప్రక్కగ జేయుచు నన్ను మిక్కిలి

న్యాయగ ద్రోయుచుండె కదా ♦ క్రూరవిచారమహాంబురాసిలో
తేలుదునో మునుంగుదునో ♦ తెల్ప నసాధ్యము లయ్యె సీత్తరిన్.

రాజ్యం—ప్రవేశించి రామం! రామం!

రామం—ఎందుకు రాజ్యం.

రాజ్యం—మన్మథరావుగారు వొస్తున్నారు.

రామం—ఏడీ! ఏడీ!

మన్మథుడు—ప్రవేశిస్తు సీత పతివ్రతేనా రామం.

రామం—ముమ్మాటికి నీ సీత పతివ్రత, నీవు సుగుణశీలుడవు.

మన్మ—ఇప్పటికైనా యథార్థాన్ని తెలుసుకో గలిగావా.

రామం—యథార్థాన్ని తెలుసుకోగలిగితిని మన్మథా! త్రికరణశుద్ధిగా నన్ను క్షమింపుము బావా! నావలన యెన్నెన్ని యగచాట్లకు లోనైపోతివి బావా!

ఉ. భారతజాతిఖ్యాతి నిలు ♦ పంగను పుట్టిన పుణ్యమూర్తివం
చారయలేకనే పధిక ♦ యాగ్రహదుర్వ్యథభూతబోధిచే
జారునిగా తలంచి నిను ♦ చాల శ్రమింపగ జేసి యుంటినో
భూరిదయాసముద్ర దయ ♦ బూనుచు నన్ క్షమియించు మిప్పుడే.

మన్మ—బావా! ఇప్పటికైనా సీత మహాపతివ్రతయని తలంచుతావా. అట్లు తలంపకున్నచో మంగళాక్షరములతో యెంతరామాయణమును రచించుకోని హృదయాలయములో దాచుకున్నానో పగలచీల్చి చూపమంటావా.

రామం—వలదు వలదు. ఇప్పటికే పాపాన్ని మూటగట్టుకొంటిని. ఇప్పుడు యింకా యెందుకు మూటగట్టుకోమంటావు మన్మథా.

రాజ్యం—(వోరకంట చూస్తు) (లోనలో) ఓహో యేమి యీత్యాగధనుని స్థిరసంకల్పం ...

రాజ్యం—పోనీయ్ ఆయనగారు చెప్పకపోతే చెప్పకపోయారు, నాకు చెప్పవూ.

బాబు—ఐతే చెప్తా సీత.

రామం—(ఆదుర్దాతో) సీతే.

మన్మ—నాసోదరి సీతే...

రామం—నేడెంత మధూదయమాయీ బాబూ యెంత మధురముగా నున్నవోయీ ఆరెండక్కరాలు.

తే. మధురమునకన్న మధురాతి ♦ మధురమౌచు
యున్నవా రెండుయక్కరా ♦ లన్న విన్న
ఎన్నిసారులు జపియింప ♦ నన్నిసార్లు
దేవతామృతసరసిలో ♦ తేలుచుందు.

రాజ్యం—మీనాన్న పేరూ.

బాబు—ఉక్కుగుండెకల రామం!

మన్మ—హా! యెన్నినాళ్ళకు మరల నిన్ను చూడగల్గితినోయీ బుల్లిబాబూ,

రామం—హా తనయా.

తే. వాసిగాంచిన యార్యోల ♦ వారినెల్ల
పావనము చేయపుట్టిన ♦ భాన్కరుండ
వనగ చాల్లిన్ను యున్నినా ♦ క్రూరయుతుండ
నున్నదుష్టుని తండ్రిని ♦ నన్నుగనుము.

బాబు—చాలు! చాలు! నీవా నాకు తండ్రివి. నాతండ్రిగారిది వుక్కుగుండె. పాషాణామృతం. ఆయనకళ్ళు యినపకళ్ళు. ఆయన యినపమనిషి. ఆయనలో పాపభీతి లేదు. ఆయన గారివే నీవైతే నన్ను చూచి విచారపడగలవా. ఒకవేళ విచారపడ్డ కన్నులనీరు కట్టవు మరినీవు కన్నీళ్లు కాల్వలుగా కారుస్తున్నా

వుగా—కాబట్టి నీవు నాతండ్రివి కావు. నీవెవ్వరివో నాకేమి తెలుస్తుంది? నన్నుమాత్రం ముట్టుకోపోకండి. అనవసరంగా అధికంగా మీరిట్టి కూడనిమాటలన్నప్పుడు మా మామయ్య మన్మధరావుగారే నానమతుములో నున్నట్లయితే యీపాటికి మీబుఱ్ఱలు రామకీర్తనపాడేవే, బాలుడనై పోతిని కాబట్టి బ్రతికిపోతిరి. అదిన్నీగాక యీరాజ్యమ్మగారిని చూచి వోర్పు కోగలిగితిని. మీవంటివారికి తగదు. ఇటువంటివారని తెలిసికో లేక వచ్చితిని. ఇకరానూ రాకూడదూ.

(అని పారిపోవుచుండును.)

రాజ్యం—బాబూ! నే నున్నగా పోకుము. పోకుము.

మన్మ—మాధవా! ఆగుము ఆగుము.

రామం—ఆలశ్య మెందుకూ మనంకూడా వేగమే పోదాంపదండి.

రాజ్యం—పదండి. తలుపులకు తాళాలువేసి నేనుకూడా వస్తాను.

(తెర వ్రాలును.)

## పంచమ రంగం.

---

సీత—

ఉ. ఓవరమేశ యీశ హర ♦ వోనిధిపావన పావభంజనా
వోపరమాత్మ వోసుమన ♦ వోరజితాద్రినివాస శంకరా
నీపదపంకజమ్ములను ♦ నిత్యము గొల్చెడి బీదసీతపై
జూపవదేల నీకరుణ ♦ సుంతయుకూడను నాగభూషణా.

మధూకరమునకు పోయిన నాముద్దులయ్య యింకనూ రాకున్నాడే. ఏమి జరిగినదో కదా! నా కిం కేకేఘ మూడనున్నదో

కదా పాపరమేశ్వరా నా ప్రాణము లేలనో యీనాడు సుడి తిరిగి పోవుచున్నవి. ఆయాసము. సహింపజాలం. (అని కోప్పిల్లి పడిపోవును.)

బాబు (ప్రవేశించి తల్లిని చూచి) అమ్మా! అమ్మా! పలుకవేల నమ్మా.

పున్నమ—(చూచి) సోదరీ! సోదరీ!

రామం—సీతా! సీతా!

రాజ్యం—కటకటా ఎన్నియిడుములకు లోనై పోయినదీ తల్లి.

రామం—సీతా! సీతా! నాజీవనజ్యోతి నావంతపవిత్రపారుజాతపరిమళ పుష్పరాజమా ఒక్కసారి యీపాపిని హృదయునిపై నీకాంత పరశనమ్మోహనదృక్కుల ప్రసరింపజేసి కృతార్థుని చేయవా సీతా! నీచక్రోధమహాపాతక యసమానపెనుభూతమునకులనిన్ను గుఱిచేసిన కలుషాత్ముని భయానకస్వరూపమును వీక్షింప రాదనియా నీదయార్ద్రనయనారవిందముల వికసింప జేయకుం టివి. సీతా కేతకీగర్భదళముల దిరస్కరించు నీదేహకాంతి ఇట్లు వసివాడి యున్నదేమీ. కటకటా! చమరీవాల సదృశమగు నీ కేశకలాపము ధూళిమయమై యున్నదేమీ సీతా! సీతా!

చ. మమకుల గౌరవాపు లతి ♦ మందగిలుండ విచారమొంది యు
త్యామరులు చక్కబెట్టుమని ♦ యంపగవచ్చిన సాధ్వివంచు యి
ద్క్కమతికి తోచకిట్లు విన ♦ కూడని ఘోరమహావిషాదపా
పమున తపింప త్రోసితిని ♦ మత్తుడ మూర్ఖుడ నౌచు ధాత్రిపై.

చ. పరిమళయుక్తమా పసుపు ♦ పచ్చని తెల్గుపర్నూన మీవటం
చెరయగలేక యప్పుడతి ♦ యల్పమహోగ్రకరాంఘ్రఘోరభీ
కరభయరూపధారిణగు ♦ కల్మషనింద్యపిశాచిచేతికి
త్వరపడి ప్రంగమంచిడితి ♦ త్రాష్టుడ భ్రష్టుడ దృష్టిహీనుడగ.

సీత—(మెల్లిగా కన్నులు విప్పిచూచి) కలా! నిక్కువమా నిజముగా నానాధునిపాదపద్మముల సన్నిధిని ప్రాలియున్నానా.

బాబు—అమ్మా! ఊర్కుండె యినవకళ్ళో గలతండ్రి కాళ్ళకడ ను న్నావు. నొక్కితే నలిగిపోతావేమో దూరంగానే వుండమ్మా.

సీత—ధన్యురాలను. ధన్యురాలను. నిజంగా యివి నా నాధుని పాద పద్మములే! ప్రభూ! మీపాదపద్మముల స్పర్శాభాగ్యము ఎన్ని వత్సరాలకు లభించిందినాధా! మీపాదధూళి నానొసట తనివి తీర నలంకరింప జేసికొననిండు. మీపాదప్రక్షాళనమునకు నాకు కడకంటి. కన్నీరుకూడా కరువైపోయినది ప్రభూ! (దీన ముగా ఉష్ణాశ్రువుల నింపుచున్న నాధునిచూచి) విచారింప కండి. పాప అనుమాన పిశాచభూతం మిమ్మింత నీంసింపచేసిందీ నాధా సకలదేవతాసాక్షిగా నేనుయధార్థాన్నే వుగ్గడిస్తున్నాను సావకాశముగా అవధరింపండి. నేను అపరాధినీకానూ పాతకినీ కానూ ద్రోహశీలనూకాను (కన్నీరు నింపుచున్న మన్మధుని చూచి) ఈమన్మధుడు నాకు ప్రియసోదరుడు పెంపుడుతమ్ముడు మీరు అపోహపడి నన్ను విడనాడితిరి. ప్రభూ! నేనట్టి ఘోర కార్య మాచరింపగలదాననా ఇప్పటికైననూనమ్ముడు. ప్రభూ మీఅనంతకోటిసూర్యప్రకాశసదృశమైన కోమలస్వరూపమును భావనాలేఖనిచే ననురాగసుధారసముతో నాహృదయఫలక మున నెంతగాఢముగా చిత్రించుకొనుచున్నదాననో నాయీ గుండెలు చీల్చిచూచినగాని మీకు తెలియదేమో విభో పరీ క్షింపుడు సిద్ధముగా నున్నాను.

బాబు—అమ్మా! మనమాటలు వారియినపచెవుల కెక్కుతాయా.

రామం—బాబూ! అపరాధిని క్షమింపమని వేడుకొనుచుంటినిగదా తండ్రీ యింకనూశుష్కనీవాలాలచే నేల పొడిచి పొడిచి చంపు కొనిమెదవూ.

సీత—బాబూ! పితృదేవుని క్షమింపవచ్చునా మహాపాపము కాబట్టి క్షమింపమని వేడుకొనుము.

బాబు—క్షమింపుము తండ్రీ! (అని పాదములకడ వ్రాలును) రాముడు ఆనందాశ్రువుల రాల్చుచూ చంక నెత్తుకొని ముద్దుల జూరకొనుచూ)

రామం—తండ్రీ! నిజముగా నేను కఠినాత్ముడనే నోయీ.

రాజ్యం—తక్కువవాడా. తండ్రికన్నా యేడాకులు యెనువెక్కువే చదువుకున్నాడు.

రామం—పైగా మేనమామగుణాలే మేనల్లున కబ్బినవి.

రాజ్యం—నాగుణా లెందు కబ్బుతాయీ. వంశమోవాడాలితో కోనన్నాడు.

గిరిరావు ప్రవేశించి—ఓసీతారామమన్మధులారా! ఈపాపాత్ముని ఈ గిరిరావును త్రికరణశుద్ధిగా క్షమింపండి. (కాళ్ళబడును)

మన్మ—అనుగ్రహింపబడితి లెమ్ము.

భైర...ప్రవేశించి—తల్లీ! సీతమ్మతల్లీ! నన్నుకూడా క్షమింపుతల్లీ! నాలో నున్న రాక్షసత్వాన్ని హనుమంతుడు సంహరించి మానవత్వం ప్రసాదించాడు.

పో—(ఈశ్వరుడుగా ప్రవేశించి) భైరవా! నీవిప్పటికి కృతార్థుడవై తివి.

భైర—లింగ, లింగ, లింగా తరించితిని.

పో—శాస్త్రిగారూ! ఈశ్వరావతారము, హనుమావతారముల చూపించి మీ కెంతెమో ఆనందమును చేకూర్చినాను. గనుక పీర్ల పండుగ గనుక మామూళ్ళు అంతా యిచ్చారు అందరితో పాటు మీరుకూడా మీకు తోచింది తృణమో ఫణమో ఇస్తే సంతోషించి పోతా (సంటూ వేసుకొన్న ద్రస్సును వూడదీయుచుండ భైరవుడు చూచి కోపముతో)

భైర—ఓరీ దున్నా నీవటరా యింతపనీ చేసింది.

పో—ఏమిచేశాను మహాప్రభో పీర్లపండుగగనుక వేషాలు వేసు కొచ్చాను.

భైర—ఇంకా మాట్లాడుతున్నావా మాయముండాకొడకా మాయ వేషాలేసి నన్ను మాయచేసి కొంప లార్పచూస్తావటరా తుచ్ఛుడా చూడిప్పుడు ని న్నేమి చేస్తానో!

సీత—శాస్త్రీ! ఆగ్రహింపకు ... నాథా! ఈభైరవశాస్త్రి నన్ను బలవంతముగా చెఱపతలంచుచుండ ఈపోష్టుజమానుగారివలన నే సంరక్షింపబడితిని. నిజముగా ఈతని నాపాలిటకు వీరాంజనేయునివలెనే ప్రత్యక్షమవడి కాపాడినాడు కాబట్టి వీనికి మంచి బహుమాన మివ్వవలయును.

రామం—ఖాసీం! ఇదిగో వందరూపాలకాగితం పుచ్చుకో.

సీత—సంతోషమేనా.

పో—నిండా సంతోషం.

రామం—రాజ్యం!

రాజ్యం—ఎందుకు రామం.

రామం—సమయానికి వేదోక్తంగా వివాహం చేయించడానికి భైరవ శాస్త్రిగారుకూడా పిలవకుండానే తయారై వొచ్చాడు.

రాజ్యం—ఎవరికీ.

రామం—మీాయిరువురికి సమ్మతమేనా?

రాజ్యం—సమ్మతమే.

రామం—శాస్త్రీ! వివాహమంటపము సిద్ధపరిపించుము.

సీత—పెండ్లికొడుకునకూ, పెండ్లికూతునకు మంగళస్నానాలు చేయించి పసుపుపారాయణాలు పెట్టమంటారా.

రామం—ఇంకా సందేహమా త్వరగా కావాలి.

బాబు—నాన్నా! నాకు కూడా పెండ్లి చెయ్యి.

రామం—బాబూ, త్వరలోనే ఆడపిల్లను కనిస్తారులే మీ అత్తా మామయ్యలు.

మన్మ—మీ నాయన మీ యమ్మను యింత సుఖపెట్టినాడు కదా ఇక నీవు కాని నాకూతురు నిస్తే ఇంతకు మిచుమిక్కిలే సుఖపెడతావు

సీత………రాజమ్మ పెండ్లికూతురాయెనే (అని పాడుచుండ)

తెర వ్రాలును.

— మంగళహారతి —

నిత్యహారతులివే యీశా
తావకీన మృదుమంగళాంఘ్రిలకు ॥ని॥
భక్తత్రాణ ముక్తిప్రధానా గానము కర్పూరపు
హారతి ॥ని॥

సర్వం సంపూర్ణము.

శాస్త్ర ప్రెస్, రాజమండ్రి.